


# స్త్రీ సాహసము

అంజలి..నాగేశ్వరరావు..సూర్యప్రభ..సి.యస్.ఆర్
శివరావు..రేలంగి..గిరిజ..రామ్మూర్తి..సీతారామయ్య
పి.వరలక్ష్మి..సదాశివరావు..అన్నపూర్ణ..

సంగీతం...సుబ్బురామన్
ఛాయాగ్రహణం...రంగా
కళ...వాలి, గోడగాంకర్



దర్శకత్వం...వేదాంతం రాఘవయ్య
రచన, పర్యవేక్షణ.... సముద్రాల..

MATA

ఆంధ్రా, సీడెడ్, నైజాంలో
పూర్ణా రిలీజు
విజయవాడ

మైసూరు:
అమృత పిక్చర్స్
బెంగుళూరు

# చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి

| విషయము | | పేజి |
|---|---|---|


ఇవన్నీగాక పజిలు, పాటలు,
యుక్తి లెక్కలు, ఇంకా,
ఇంకా ఎన్నో వున్నై.

చందమామ ఆఫీసు
పోస్టు బాక్సు నెంబరు. 1686
మద్రాసు-1.

ఆరోగ్యానికీ, రుచికరానికీ



పూజలకు, వివాహాలకు




గడియారం మార్కు
కర్పూరము
ఉపయోగించండి

గోపాల్జీ చాంపషీ & కో.

ఆంధ్రదేశమంతటా దిగ్విజయముగా నడచుచున్నది !



శోభనాచల వారి

# తిలోత్తమ

మహోజ్వలముగా నిర్మించబడిన మహత్తర జానపద చిత్రము

అంజలీదేవి..నాగేశ్వరరావు..సూర్యప్రభ

నటించినది

డైరెక్టర్......రాజా సాహెబ్ ఆఫ్ మీర్జాపురం

మీ ముఖ లావణ్యమునకు
నూతన సొంపు



కాష్మీర్ స్నో ముఖచర్మమునకు
క్రొత్త అందంబును ఇచ్చును.
దీనిని క్రీముగానూ, మేకప్ కొరకునూ
ఉపయోగించినయెడల మీకు అపూర్వమైన
సౌందర్యమువచ్చును.




NATIONAL TRADING CO. BOMBAY 2. — MADRAS.

ది నేషనల్ ట్రేడింగ్ కంపెనీ
బొంబాయి - 2 :: మద్రాసు - 1





ఇప్పుడు దొరుకుచున్నది
అమెరికన్ మోడల్
రోల్ ఫిలిమ్ బాక్సు
కెమెరా

గొప్ప పవర్ లెన్సుల తోను వ్యూఫైన్డర్‌తోనూ అమర్చబడిన అత్యుత్తమమైన ఈ కెమెరా చాల చౌక. ప్రారంభకులుకూడ చక్కగ ఉపయోగించవచ్చు. నం. 120 రు ఫిలిమ్ పైన 2¼"×3¼" సైజులో అద్భుతముగా ఫోటోలు ఎత్తును. ఫోటోలు తీయు విధానంతో సహా వెల రు. 10-8-0. ప్యాకింగ్, పోస్టేజి లకు రు. 1-8-0 అదనం. కెమెరాకు సరిపడు లెదర్ కేస్, రు. 3-0-0. సరుకు కొద్దిగ ఉన్నది. నేడే ఆర్డరివ్వండి. ఉత్తర ప్రత్యుత్తరములు ఇంగ్లీషులోనే జరుపండి.

**BENGAL CAMERA HOUSE (108 C. M.)**
**P. O. 21, ALIGARH, U. P.**






శాస్త్రి పెన్ వర్క్సు • తెనాలి

# జుపిటర్ వారి

# మర్మయోగి

(ADULTS ONLY)

దుర్గుణవతి ఒకర్తె
చట్ట దిట్టాల్ని ఎదుర్కోన్న
దోపిడిగాణ్ణి పట్టివ్వటానికి
సద్గుణవతిని బాటుగా పంపింది

విజయవంతమైన **3** .వ వారం

మద్రాసు
ప్రభాత్
చిత్రా
రాజకుమారి
ఆదితర ముఖ్య కేంద్రాలలో
జరుగుతున్నది





పూర్ణా రిలీస్
కె. రామనాథ్
ఎ. ఎస్. ఎ. సామి

# మిత్రాంజనం




మిత్ర ఫార్మసీ - తెనాలి

భారతీయులకు సాటిలేని బహుమానం
ఇంట్లో కూర్చుని దేశవిదేశాల 14 భాషలు
నేర్చుంకోండి

ఈ 14 భాషల పుస్తకం ద్వారా మీరు ఇంట్లో కూర్చుని సులభంగా హిందీ, బంగాళీ, గుజరాతీ, మరాఠీ, టర్కీ. పంజాబీ, ఇంగ్లీషు, బ్రహ్మ, చైనా, జాపాను మొదలైన 14భాషలు వ్రాయనూ, చదువనూ, మాట్లాడనూ నేర్చుకొనవచ్చును. అమూల్యమైన పుస్తకం.

వెల 4-0-0 పోస్టేజి 0-12-0 అదనం.

## అల్లికపనుల యంత్రం

బట్టలమీద అందమైన తీగలూ, లతలూ, పువ్వులూ, ఆకులూ మొదలైనవి అల్లటానికి 4 సూదుల విదేశీ యంత్రం. వెల 4-0-0 పోస్టేజి 1-4-0 అదనం.

అనేక డిజైన్లు కలిగిన అల్లికపనుల పుస్తకం
వెల 3-0-0 పోస్టేజి 0-12-0 అదనం.

**BENGAL TRADERS (C.M.C.)**
**P. O. 21 ALIGARH U. P.**

**FOR PLEASANT READING &**
**PROFITABLE ADVERTISING:**

# Chandamama Group

**(HINDI, TELUGU, TAMIL & KANNADA)**

**EVERY MONTH ADORNS**
**95,000 HOMES**

and

Enchants Ten Times the
Number of Readers
throught India

★

## Group Page Rs. 350

★

**ENQUIRE:**

**P. O. BOX 1686, MADRAS-1**

MORTON..

మిఠాయిలలోకెల్ల

తియ్యటి మిఠాయి



**C. & E. MORTON (INDIA) LTD.**

MAKERS OF QUALITY CONFECTIONERY

INCLUDING

Cream Toffees, Fruit Centered Sweets, Barley Sugar Lollies, Satin Confectionery, Peppermint-lozenges etc.

ASP.M

---

సోల్ ఏజెంట్లు,

## సౌత్ ఇండియా కార్పొరేషన్ (మద్రాసు) లిడ్.,

**80, శంభుదాస్ వీధి, మదరాసు - 1** (ద. ఇండియా)














# రు. 500 బహుమానము

## ఉమా గోల్డు కవరింగు వర్క్సు

**ఉమా మహల్ :: మచిలీపట్నము**

ఉమా గోల్డు కవరింగు వర్క్సు పోస్టాఫీసు.

అసలు బంగారు రేకు లోహముపైన అంటించి (Gold Sheet Welding on Metal) తయారు చేయబడినవి. కాదని రుజువు చేసినవారికి రు. 500 బహుమానమివ్వబడును. మేము తయారు చేయు ప్రతివస్తువు ప్యాకింగు పైన "ఉమా" అను ఇంగ్లీషు అక్షరములు గుర్తించి కొనవలెను. బంగారు వన్నె 10 సంవత్సరములు గ్యారంటీ.

* * *

పరీక్ష చేయగోరువారు ఉమా ఆభరణములను మహాద్రావకములో వేసిన 5 నిమిషములకే బంగారము రేకు వెడలివచ్చును. ఈ విధముగా పరీక్ష చేసినవారు అనేకమంది మాకు సర్టిఫికేట్లు ఇచ్చియున్నారు. 800 డిజయినులు గల క్యాటలాగు ఉచితముగా పంపబడును. ఇతర దేశములకు క్యాటలాగు ధరలమీద 25% అధికము.

*N.B.*—వస్తువుల వి. పి. పార్శిలు చార్జి 0-15-0 మాత్రమే అగును

Tel: "UMA" MASULIPATAM.



నేషనల్ వారి

## ఇన్డిపెన్డెన్సు

టాల్కం పౌడర్




**THE NATIONAL TRADING CO.**

BOMBAY 2. & 391, MINT ST., MADRAS 1





# డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియుస్ను. పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co., BOMBAY-4

డిస్ట్రిబ్యూటర్సు
రాధాకృష్ణాఫిలింస్
రాజమండ్రి

మార్చినెలలో ఆంధ్ర ప్రేక్షకులకు
.. .. ఆనందమునిస్తుంది!



రవీపిక్చర్సువారి.....

# పెంకిపిల్ల

-తెలుగు

నిర్మాత దర్శకుడు
బి. వి. రామానందం

సహాయదర్శకుడు
యర్రా అప్పారావు బి.ఏ.

డిస్ట్రిబ్యూటర్లు :

ఆంధ్ర :
రాధాకృష్ణా ఫిలింస్, రాజమండ్రి



చిత్తూరు, రాయలసీమలకు :
నేతాజి ఫిలిం డిస్ట్రిబ్యూటింగ్ కం. ధర్మవరం

ఇతర వివరాలకు : రవి పిక్చర్స్, రాజరత్న బిల్డింగ్స్, హాస్పిటల్ రోడ్, రాజమహేంద్రవరము

## రూ. 5-14-0 కు గోల్డన్ బంగారు నగలు



స్త్రీలకు ఆనందమిచ్చే నూతన డిజైనులలో నాలుగు అందమైన ఆభరణములు గోల్డెన్ బంగారుతో తయారు చేయబడినవి. వన్నె, కాంతియందు అసలు బంగారువలె కనుపించును. అన్ని మతాలవారు ఉపయోగించుచున్నారు. ఆభరణముల వివరం: ఒక జత డైమన్ గాజులు, ఒక జత చంద్రరేఖ స్టార్ లోలకులు, ఒక 9 రాళ్ల డైమన్ ఉంగరం, ఒక నెక్లెస్ చైను, ఈ నాలుగు ఆభరణములు ఒక ముచ్చటైన పెట్టెలో అమర్చియున్నవి.

ధర రు. 5-14-0.

కొలది స్టాక్ మాత్రమే. నేడే వ్రాయండి.

**సుష్మా అండ్ కంపెనీ,** పోస్టు బాక్సు నెం. 89, మద్రాసు - 1

**SUSHMA & COMPANY, GOLDEN JEWELLERS, P. O. Box 89, Madras-1.**



## ఇంకా తగ్గింపు ధరలు!

కంచాలకూ, పళ్ళెములకూ ధరలు తగ్గినవి

గ్యారంటీ స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు
మాసిపోవు. ఎప్పుడూ కాంతిగానుండును.

ప్రతి ఇంటికి, హెూటెలుకు, హాస్టలుకు, హాస్పిటల్ కాన్టీన్సుకు
కావలసిన పరికరములన్నియు దొరకును

విలాసయుతమైన చవుక సామగ్రి

ఆరోగ్యానికి




శాశ్వతత్వానికి

ఆంధ్ర జిల్లాలకు ఏజంట్లు:
శ్రీ ప్రభూజీ ఏజన్సీస్,
జాంపేట :: రాజమండ్రి

తయారుచేయువారు

**ఇండియన్ మెటల్ & మెటలర్జికల్ కార్పొరేషన్**

498, మింట్ స్ట్రీట్ :: మద్రాసు - 3

# నమ్మిక! . . .

అత్యుత్తమమైన టాయిలెట్ సబ్బులో
ఏమేమి మీరు కావలెనంటారో, అవన్నీ

**మైసూరు శాండల్ సబ్బులో**

కలవని నమ్మకముగా చెప్పగలము

ప్రతిచోట దొరకును

## గవర్నమెంటు సోప్ ఫ్యాక్టరీ
బెంగుళూరు



*A SCIENTIFIC ADJUNCT...*



మీ మామూలు ఆహారమునకు ఇది ఒక శాస్త్రోక్తమైన చేర్పు. **ఆల్బో-శాంగ్**' గొప్ప గుణమునిచ్చి, త్వరితముగ పని చేసి మధురమైన టానిక్కు. దీని వాడుకచే అగ్నిమాంద్యము పోవును, రక్తము వృద్ధి అగును, తూకము హెచ్చును. ఇది పిల్లలకు, పెద్దలకు ఒక్క విధముగా గుణము నిచ్చును.

# Albo-Sang
FOR BALANCED NUTRITION
Price Rs. 1/2 : 3/- & 7/8.

## J. & J. DeChane
RESIDENCY ROAD, HYDERABAD-Dn.









సంపుటి 8
సంచిక 3

మార్చి
1951

# చందమామ

సంచాలకుడు : చక్రపాణి

---

ప్రతినెలలో వచ్చే శుక్లచతుర్దశి శివునికి ప్రీతికరమైన రోజు. అందులోనూ మాఘశుద్ధ చతుర్దశి (ఈ 6-వ తేది) మహాశివరాత్రి కావడంచేత శివపూజకు మరీ గొప్ప పర్వమై ఉన్నది. శివాలయాలు మన దేశమంతటా వెలసి ఉన్నయి. కాళహస్తి, ద్రాక్షారామ, శ్రీకాకుళం అమరావతి, మహానంది, కోటప్పకొండ మొదలైనవి తెనుగునాట ఉండే పెద్ద శివక్షేత్రాలలో కొన్ని. దక్షిణాదిని రామేశ్వరం ముఖ్యమైన శివక్షేత్రం. పోతే, ఉత్తరాన గల శివక్షేత్రాలలోకల్లా ముఖ్యమైనది కాశీ. దీనితర్వాత గొప్పగా ఎంచబడే శివక్షేత్రం భువనేశ్వరం. ఈ ఒక్క క్షేత్రంలోనే ఐదువందల శివాలయాలున్నాయట! శివరాత్రినాడు ఈ క్షేత్రాలన్ని, లక్షలాది ప్రజతో ఇసుకవేస్తె రాలకుండా నిండిపుంటై. ఈ రోజున భక్తులందరూ ఉపవాసం ఉండి, రాత్రల్లా సత్కథాకాలక్షేపాలతో జాగరణంచేసి, మరునాడు ఉదయం బిల్వపత్రాలతో లింగపూజ చేసి బ్రహ్మాండంగా అభిషేకాలు జరిపిస్తారు. శివమహిమలను తెలిపే చిత్రమైన గాథలు కొన్నిటిని యిదివరకే చందమామలో చదివారు. అటువంటిదే ఈ సంచికలో మీరు చదవబోయే 'అపక్వఘటం' అనే కథ.








# తెలివి తక్కువ కోడిపిల్ల

చెరువొక్కటి ఉందొకచో
చాలా చక్కని చెరువది.
చుట్టునున్న ప్రాణికోటి
కంతటికిని ఆదరు వది.

ఒక బాతుల గుంపు తరచు
వస్తుందా చెరువు కడకు.
బాతులన్ని ఈతగొట్టి
ఆడుతాయి చాలతడవు.

చర్చిస్తవి గంభీరం
గా వ్యవహారాలన్నీ.
బాతుభాషలో కిచకిచ
లాడుతాయి అవి అన్నీ.

ఒకరోజా చుట్టుపట్ల
నివసించే కోడిపిల్ల
ఒడ్డున నిలబడి చూచిం
దీ బాతుల ఆటలెల్ల.

'నేను కూడ అట్లాగే
ఎందు కీత గొట్టలేను?
చేపలాగ ఈదుకొంటు
ఈ చెరువును చుట్టలేను?'

రచన :
"బైరాగి"

అని అనుకొన్నది మదిలో
తెలివిలేని కోడిపిల్ల.
కల్లలు అనుకొన్నది తన
తల్లి అన్న మాటలెల్ల.

'బాతులవలె నాకుగూడ
కళ్ళున్నవి, కాళ్ళున్నవి.
రెక్క లివే నాకుగూడ
ఈదేందుకు నీళ్ళున్నవి.

ముక్కులు కొంచెం వేరుగ
ఉన్నమాట నిజము కాని,
నేను కూడ ఈదగలను
తల్లిమాట కేమి గాని?'

అనుకొంటూ నీటిలోకి
దూకిందా కోడిపిల్ల.
అప్పుడు రుజువైనయ్ తన
తల్లిఅన్న మాట లెల్ల.

తన్నుకొనీ, గింజుగొనీ
మునిగిపోయినది చివరకు.
పెద్దలన్న మాట లెల్ల
తమ పిల్లల మేలుకొరకు.





# నాయనమ్మ పాట



నాయనమ్మ మాటలంటె నాకెంతో తీపి!
అమ్మకంటె మిన్నగాను ఆదరించుతుంది!
ఆవకాయ ముక్క వేసి బువ్వ పెట్టుతుంది,
కమ్మన్ని మినపరొట్టె కాల్చి పెడుతుంది,
రేపటికొక చిన్నముక్క దాచీ పెడుతుంది!

" ఉట్టిమీద బుట్టలోను
దాచిపెట్టు రొట్టెముక్క
చిట్టెలుకలు కొట్టేస్తాయ్
జాగర్తోయ్ నాయనమ్మ !"
అంటే ఆవిడ వింటేనా?

పంటయింట నాయనమ్మ
కాస్త కన్ను మూయగానె
నాయనమ్మ నెత్తి మీద
చిట్టెలుకలు నాట్యమాడి
అమట్టున ఉట్టెక్కి
ఊదేస్తాయ్ రొట్టెముక్క!

" ఔరౌర చిట్టిగా, అన్నట్టే
పట్టపగలు వెధవెలకలు
రొట్టంతా తిని పోయాయ్ "
అంటూ మరి దాచకుండ
అంతా పెట్టేస్తుందని
నాయనమ్మ మాటలంటె
నాకు బలే ఇష్టం!

నాయనమ్మ మాటకంటె
ప్రియమైనది మరొకటుంది
నాయనమ్మ ఉపవాసం
నాకు బలే సంతోషం!
తియ్యటి చలిమిడి కలిపి
చల్లటి వడపప్పు చేసీ
పిల్చి నాకు పెడుతుంది
అందుకనే
నాయనమ్మ ఏకాదశి
నాకెంతో సంతోషం!

రోజూ ఒక ఏకాదశి
రావాలని కోరుకుంటె
నాయనమ్మ నామీదికి
రాకాశీ అవతారం
ఎత్తిందంటే కష్టం
అయినా
నాయనమ్మ మాటలంటె
నాకెంతో ఇష్టం !!

[ " మహేశ్వర్ " మద్రాను ]




'త్రరడోకే' గ్రామంలో 'గోరా' అనే ఒక కుమ్మరి ఉండేవాడు. అతడు చాలా గొప్ప భక్తుడు. ఏ పని చేస్తున్నా పాండురంగ విఠ్ఠలస్వామిని స్మరిస్తూ ఉండేవాడు. అతని కీర్తి విని, దేశంలో ఎక్కడెక్కడి భక్తులూ అతణ్ణి చూడటానికని వచ్చేవారు.

ఇలాంటి భక్తులగుంపు ఒకటి ఒకనాడు అతని యింట దిగింది. ఆ భక్తులకేమేమి కావాలో చూడడం అయాక గోరా తన కుమ్మరావం దగ్గిరకు వెళ్ళి, అక్కడ కాలి చల్లారిన ఒక్కొక్క కుండనే తీసి తన కర్ర చెక్కతో మెల్లిగా తట్టి పరీక్షించి, పక్కని పెడుతూ వచ్చాడు.

వచ్చిన భక్తులంతా అతని యింట విందు అరగించిన తరవాత ఎవరిమటుకు వారు హాయిగా పడుకున్నారు.

కాని, వారిలో ఒక్కడు మాత్రం అలా విశ్రమించక గోరాదగ్గిరకువచ్చి కూర్చుని, 'ఎందుకయ్యా. అలా ఒక్కొక్క కుండనే మోగిస్తున్నావు?' అని అడిగేడు.

"ఈ కుండలన్నీ బాగా కాలినయో లేదో అని పరీక్ష చేస్తున్నాను. అపక్వ ఘటం (కాలని కుండ) ఏదైనా ఉంటే మళ్ళీ ఆవంలో పెట్టి కాలుస్తాను" అన్నాడు.

అప్పుడా భక్తుడు, "మహాత్మా, నేనూ ఇక్కడ విశ్రమిస్తూన్న ఈ భక్తులూకూడా ఈ కుండలలాంటివాళ్ళమే. మాలోకూడా కొన్ని కాలని కుండలు ఉండవచ్చు. అలాంటివాళ్ళెవరో పరీక్షించి తెలుసుకుని జ్ఞానబోధచేసి, పక్వం చెయ్యండి" అని ప్రార్థించాడు.

ఈ మాటలు విని గోరా, 'అబ్బాయీ! ఈ భక్తులలో ఎవరికో ఇంకా పరిపూర్ణ జ్ఞానం కలగలేదనే వుద్దేశంతో అతణ్ణి కటాక్షించటంకోసమే నీచేత పాండురంగ విఠ్ఠలుడు ఈమాటలు పలికించాడు. ఆ అపక్వ

పి. సౌభాగ్యలక్ష్మి, విజయనగరం



ఘటం ఎవరో చూద్దాం, పద' అంటూ ఆ కర్రచెక్కతోనే లోపలికి వచ్చాడు.

అప్పుడే భక్తులంతా నిద్ర మేలుకుని బద్ధకంగా ఆవలిస్తున్నారు. గోరా ఒక్కొక్కడి నెత్తిమీదనే కర్రచెక్కతో ఒక్కొక్క దెబ్బకొట్టి చక్కా వెళ్లేడు.

వాళ్లెవరూ కిక్కురుమనలేదు గాని చిట్ట చివర కూర్చునివున్న నామదేవుడనే భక్తుడు తలకి చేతులు అడ్డుపెట్టుకుని 'ఏమిటయ్యా గోరా! నీ యింటికి అతిథులమై వస్తే మమ్మల్ని కొడుతున్నావేమిటి?' అన్నాడు.

అందుకు గోరా 'ఈ నామదేవుడే అపక్వ ఘటం' అంటూ అందరిలోనూ గట్టిగా అనేసి, మళ్లీ తన కుమ్మరావం దగ్గరికి వెళ్లిపోయాడు.

నామదేవుడు పేరొందిన గొప్ప భక్తులలో ఒకడు. అసలు అతడు పుట్టేటప్పుడే 'విఠల్! విఠల్!! పాండురంగ విఠల్!' అని భగవన్నామ స్మరణచేస్తూ పుట్టేడు. అతడు పుట్టినప్పట్నుంచీ ఆ స్వామి పాద సేవలోనే గడుపుతున్నాడు. అలాంటివాణ్ణి 'అపక్వ ఘటం' అని అనేస్తే న్యాయమా? నామదేవుడికి చాలా అవమానమనిపించింది! ఒక్క నిమిషంకూడా వాళ్ల మధ్యని ఉండలేక అతడు అక్కడనుంచి సరాసరి పండరీపురం వెళ్ళిపోయి, పాండురంగని పాదాలపైన పడి 'స్వామీ, నన్ను గోరా తీరని అవమానం చేశాడు. నాకు పరిపూర్ణ జ్ఞానం కలగలేదట! భక్తులందరిలో నన్ను నవ్వులపాలు చేయించడం న్యాయమా ప్రభూ!' అంటూ భోరుమని విలపించాడు.

పాండురంగస్వామి చిరునవ్వుతో, 'నామదేవ్! నీ కేమీ అవమానం జరగ లేదు. నువ్వు అపక్వఘటానివన్న మాట అబద్ధం కాదు సుమా. నీకు పూర్తిగా జ్ఞానం కలగాలి!' అన్నాడు. 'నిజమేనా ప్రభూ? అలాగైతే ఆ సంపూర్ణమైన జ్ఞానాన్ని

నాకు ప్రసాదించు ' అన్నాడు, నామదేవు. అప్పుడు పాండురంగడు ' ఒక సద్గురువుని ఆశ్రయిస్తేగాని, నీకు ఆ సంపూర్ణజ్ఞానం లభించదు నామదేవ్...నాగనాథస్వామి ఆలయంలో వీసోబాకేశుడనే మహా భక్తుడున్నాడు. ఆయనకు శిష్యరికంచేసి, పక్వ ఘటానివై రావలిసింది ' అన్నాడు.

స్వామి సెలవుప్రకారం నామదేవుడు నాగనాథస్వామి గుడిపద్దకు వెళ్లి వాకబు చేయగా వీసోబాకేశుడు స్వామిసన్నిధిలో ఉన్నట్టు తెలుసుకున్నాడు. లోపలకువెళ్లి చూసేసరికి, లింగరూపంలో ఉన్న నాగ నాథస్వామిపైన తన రెండుపాదాలూపెట్టి, గుర్రుపట్టి నిద్రపోతున్న వీసోబాకేశుడు కన పడ్డాడు. నామదేవుడు నివ్వెరపోయి, ' అరే భగవంతుని నెత్తిమీదనే కాళ్లుపెట్టి నిద్ర పోయే ఈ అయోగ్యునికా నేను శిష్య రికం చెయ్యవలసింది ?' అనుకున్నాడు. ఊరుకోలేక అతడు వీసోబాను నిద్రనుండి లేపి, ' ఇదేం పనయ్యా ?' అని అడిగేడు.

వీసోబా బద్ధకంతో ' నాయనా, ఏదో నిద్రలో నా కాళ్ళు అటువైపు వెళ్ళి ఉంటాయి. ముసిలివాణ్ణి. కాళ్లుతీసి మరో చోట పెట్టే ఓపిక లేదాయె. మరోలాగ అను



కోక, నువ్వే నాకాళ్లుతీసి స్వామి లేనిచోట పెట్టిపెడుదూ !' అన్నాడు.

వెంటనే నామదేవుడు వీసోబా పాదాలు రెండూ పుచ్చుకుని లింగానికి ప్రక్కన కింద పెట్టబోయాడు. కాని ఎప్పుడొచ్చిందో, ఎక్కడ్నుంచి వచ్చిందో, అక్కడ ఒక లింగం కనపడింది. ఆశ్చర్యంతో అతడు వీసోబా కాళ్లని రెండోప్రక్క పెట్టబోయాడు. కాని, అక్కడా ఒక లింగం కనపడింది! అప్పుడు నామదేవుడు వీసోబాను కాస్త ముందుకు జరిపి, కాళ్లు అక్కడ పెట్ట బోయాడు. అక్కడకూడా ఒక లింగం సిద్ధమైంది! ఇది పనిగాదని, అతడు ఆ

వృద్ధుణ్ణి బుజంమీది కెత్తుకుని గర్భగుడి ఇవతలికి వచ్చాడు అక్కడ కూచోబెడదామని. కాని చిత్రమేమిటో, ఇవతలకూడా ఎక్కడచూచినా లింగాలే కనపడ్డాయి నామదేవుడికి! ఏమీ పాలుపోక, ఆ వృద్ధుడి కాళ్లు రెండూ తన నెత్తిమీద పెట్టుకున్నాడు! ఎప్పుడైతే ఆ పాదాలు తన శిరస్సును తాకినయో ఆ క్షణమందు నామదేవుడే ఒక లింగంగా మారిపోయాడు! అప్పుడు ఆ లింగంలోంచి 'నేనుకూడా లింగమైపోయానే? ఎక్కడ చూసినా లింగముల మయముగా వుందే!' అనే మాటలు వినిపించాయి.

అంతవరకూ కదలలేని వృద్ధునికిమల్లే నటించిన వీసోబా పుష్టిగా లేచి కూచుని, "నామదేవ్, ఇందులో చిత్రం ఏమీలేదు. 'భగవంతుడు లేనిచోటు ఎక్కడా లేదు. ఈ సంగతి నీకు తెలియటం కోసమే ఇలా చేశాను. ఇంతకాలంనుంచీ నువ్వు ఒక్క పండరీపురంలోనే పాండురంగ విఠలుని ఆకారంలో మాత్రమే భగవంతుడు ఉన్నాడనుకున్నావు. ఆయన అంతటా ఉన్నాడు. మొన్న గోరా ఇంట అతని కర్రచెక్కతో దెబ్బలుతిన్న భక్తులందరికీ ఈ సంగతి తెలుసు. ఆ కర్రచెక్కలోకూడా వాళ్లకు భగవంతుడు కనపడ్డాడు గనకనే వాళ్లు ఆ దెబ్బకు వెరపలేదు. నీకా పరిపూర్ణజ్ఞానం లేకనే, భయపడి చేతులు అడ్డుపెట్టుకున్నావు!' అన్నాడు.

అందుకు నామదేవుడు, "నిజమేప్రభూ! గోరా నన్ను 'అపక్వఘటం' అనటంతో అవమానం చేశాడనుకున్నాను. అత డన్న మాట అక్షరాలా నిజం. నేను అపక్వ ఘటాన్నే" అని ఒప్పుకున్నాడు.

అప్పుడు వీసోబా "నామదేవ్! నీకు పరిపూర్ణ జ్ఞానం కలిగింది. ఇంక నీవు నాకు శిష్యరికంచేసి నేర్చుకోవలసింది లే"దని మామూలు స్వరూపం యిచ్చి పంపేశాడు.






## 9

[ప్రాణాలకు తెగించి ఎలాగో మాయాభవనం చేరుకొన్న సంధ్యా నిశీధులు ఎలా చిక్కుబడిపోయినదీ, ఆతర్వాత వాళ్లు యుక్తివల్ల ఎలా తప్పించుకున్నదీ, చివరికి వాళ్ల ఉనికి ఉదయనుడు ఎలా తెలుసుకోగలిగిందీ క్రిందటిసారి చదివారు. ఆటుతర్వాత—]

"ఎక్కడరా మీరూ?" అనే కేక ఒకటి వినిపించిందన్నాము. ఆ కేక పెట్టింది ఎవరనుకొన్నారు? సంధ్యా నిశీధుల యుక్తి వల్ల గెడ్డపువాడివద్దకు సాగనంపబడిన రాక్షసుడే. వాడు గెడ్డపువాణ్ణి కలుసుకున్న తర్వాత అసలు విషయం వెల్లడి అయింది. "అయ్యో! వాళ్లని అక్కడే వదిలి వచ్చావా? నాదగ్గిర భస్మాలూ అవీ కాజేసి పోవటమే కాక పైగా నీకుకూడా భలే టోపీ వేశారె! వీళ్లెక్కడో గడుగ్గాయిల్లా వున్నారు చూడబోతే. ఇప్పటికైనా మించిపోయింది లేదు, నువ్వు వెంటనే తిరిగి వెళ్లి వాళ్లని పట్టుకో. లేదా మన భవనంయొక్క రహస్యం వాళ్లకి తెలిసిపోతుంది. అది కాస్తా వాళ్లకు తెలిసిందా, నీకూ నాకూకూడా అయువు మూడిందన్నమాటే. కనుక వెళ్లు, త్వరగా వెళ్లు" అని గెడ్డపువాడు రాక్షసుణ్ణి తొందరపెట్టసాగాడు.

గెడ్డపువాని సలహా ప్రకారం రాక్షసుడు భవనానికి తిరిగివచ్చేసరికి, తను కాపలా వుంచివెళ్లిన ద్వారంవద్ద సంధ్యా నిశీధులు కనుపించలేదు. అందుకనే వాడు మండిపడి, "ఎక్కడరా మీరూ?" అని పెడబొబ్బలు పెట్టుకుంటూ కొలను వైపుకి వచ్చాడు. తీరా కొలనుదగ్గిరకూడా వాళ్ల జాడ కనుపించలేదు. అందుచేత వాడు




అదేపనిగా, చీమతలకాయంత మేర కూడా విడవకుండా, ఆ చుట్టుప్రక్కల అంతా గాలించసాగాడు. సాయంత్రంవరకూ వెతికినా ప్రయోజనం లేకపోయేసరికి వాడికి ప్రాణం విసిగిపోయింది. నిరాశతో తన భవనం చేరుకొన్నాడు.

రాక్షసుడు యిలా వెతుకుతున్నంతసేపూ ఉదయనుడు తన సోదరులతో సహా హంసలరూపంలో కొలనులోనే వున్నాడు. ఎప్పుడైతే వాడు తిరిగి భవనానికి వెళ్లిపోయాడో అప్పుడు ఉదయనుడు నీటిలోంచి బైటికి వచ్చి మామూలు రూపం పొందాడు. అతనివెంటనే సరోవరకన్య కూడా బైటికి వచ్చి చేరుకుంది. అప్పుడు ఆ కన్య ఉదయనుడితో యిలా చెప్పింది:

"మీరెవరో పాపం దురదృష్టవంతులు. దారి తప్పి ఈ భవనంలో ప్రవేశించినట్టున్నారు. ఈ భవనానికి చుట్టుప్రక్కల నాలుగు కోసులుమేర ఎక్కడ ఏ పురుగు కదిలినా యిట్టే పసికట్టి పట్టివేసెయ్యగల గెడ్డపువాడు ఒకడున్నాడు. వాడిని తప్పించుకురావటం బ్రహ్మతరంకూడా కాదు. మరి మీరెలా వచ్చారో నాకు ఆశ్చర్యంగానే వున్నది. ఇప్పటికైనా మీరు ఈ చోటు వదిలి వెళ్లిపోవటం మంచిది. లేదా మీ ప్రాణాలకే మోసం కలగటం నిజం. ఈ భవనం ఒక దుష్ట రాక్షసుడిది. ఇప్పుడు వాడిక్కడ లేడు. వాడు ఎప్పుడు వచ్చేదీ ఎప్పుడు పోయేదీ ఎవరికీ తెలియదు. ఈలోపల మీ సోదరులకు మామూలు స్వరూపాలు వచ్చే మార్గం నేను చెబుతాను. అలా చేసి, త్వరగా తప్పించుకు వెళ్లిపోండి."

అంతా విని ఉదయనుడు, "మేము పొరపాటున యిక్కడికి రాలేదు. ఈ భవనంయొక్క రహస్యమేమిటో తెలుసుకోవాలనే కుతూహలంతోనే ప్రాణాలనుకూడా లెక్కపెట్టక వచ్చాము. కనుక మమ్మల్ని

గురించి నువు విచారించకు. ఆ రాక్షసుణ్ణి గురించి నీకుకూడా తెలిసిన వివరాలు చెబితే చాలు. ఇంతకూ నీవు ఎవరవో చెప్పావే కాదు. చెప్పటానికి అభ్యంతరం లేకుంటే ఆ విషయం విని సంతోషిస్తా" మన్నాడు.

అందుకు సరోవరకన్య — "చెప్పటానికి అభ్యంతరం ఏమీ లేదు. కాని, తెలుసుకొని నీవు చెయ్యగలిగింది ఏమీ వుండదనుకుంటాను. అయినా అడిగావు గనుక చెబుతాను" అంటూ కొలనులోకి వెళ్లి మరికొద్ది సేపటిలో మరిరెండు హంసలతో బైటికి వచ్చింది. సరోవరకన్యతోపాటు ఆ రెండు హంసలుకూడా ఒడ్డుకి రాగానే రెండు చక్కటి కన్యలుగా మారాయి.

వాళ్లు ముగ్గురూ ఒక్క అచ్చులో పోసినట్టుండటం చూచి ఉదయనుడు "మీరు కవలల్లా కనుపిస్తున్నారే?" అన్నాడు. "అవును" అని వాళ్ల నోటివెంటనుంచి ఎప్పుడైతే మాట వచ్చిందో ఉదయనుడు ఉత్సాహభరితుడై, "అయితే, ఇన్నాళ్లబట్టీ మేము వెతుకుతున్నది మీకోసమే. మీరు దానశీలమహారాజుగారి కుమార్తెలుకదూ?" అని అడిగాడు.



ఈ ప్రశ్నకు ఆ కన్యలు పొందిన ఆశ్చర్యం ఏమని చెప్పటం? "నిజమే. మా సంగతి నీకెలా తెలిసింది?" అని విస్తుపోతూ అడిగారు.

"ఎలా తెలిసేదేమిటి? మీ పుట్టుపూర్వోత్తరాలన్నీ మాకు తెలుసు. మిమ్మల్ని వెతికి పట్టటానికే మేము మీ తండ్రిగారి ఆశీర్వాదం పొంది బయలుదేరాం. మీ పేరు..." అని అడిగాడు ఉదయనుడు.

"సుహాసిని... మా పూర్వోత్తరాలన్నీ తెలుసునన్నారుగా? అటువంటప్పుడు తక్కిన రెండు పేర్లూ మీరే చెప్పుకోగలరనుకుంటాను" అన్నది ఆ కన్య.



"చెప్పుకోలేకేం? ఇంత సులభంగా, యింత త్వరలో మిమ్మల్ని కలుసుకోగలుగుతామని మేము కలలోకూడా అనుకోలేదు. ఈ శుభవార్త నా సోదరులకు కూడా తెలిస్తే ఎంత బాగుండునో" అని తన సోదరులు మానవ స్వరూపంతో లేనందుకు విచారం కనబరిచాడు.

ఇది చూచి సుహాసిని "విచారించకు" అంటూ కొలనులోకి దిగి మరికొద్దిసేపటికల్లా కోతిరూపంతో వున్న నిశీధుడితోనూ, శిలాప్రతిమరూపంతో వున్న సంధ్యతోనూ బైటికి వచ్చింది. తర్వాత ఉదయనుడిని వెంటబెట్టుకుని ఆ తోటలో మామిడిచెట్టు దగ్గిరికి తీసుకువెళ్లింది. ఆ చెట్టుకి ప్రక్కనే కొన్ని కుక్కగొడుగులు మొలిచివున్నై. వాటిలో కొన్నిటిని తీసుకోమన్నది. ఉదయనుడు అలాగే చేశాడు. తర్వాత మరికొంత దూరం తీసుకుపోయింది. అక్కడ ఒక రాక్షసవిగ్రహం వున్నది. ఆ విగ్రహం నోటిలోంచి నీరు ప్రవహిస్తోంది. ఆ నీరు కొంత తీసుకోమన్నది. అలాగే ఒక ఆకుతో దొన్నెచేసి యివ్వగా, ఉదయనుడు దాంట్లో ఆ నీరు నింపుకొన్నాడు. వీటితో సహా వాళ్లు తిరిగి కొలనువద్దకు చేరుకున్నారు. అప్పుడు సుహాసిని ఆ కుక్కగొడుగులని కోతికి పెట్టమన్నది. అలాగే చేసేసరికి కోతిరూపం పోయి, నిశీధుడికి తిరిగి మామూలురూపం వచ్చింది. తర్వాత దొన్నెతో తెచ్చిన నీరు శిలాప్రతిమకు రాచేసరికి సంధ్యకు మామూలురూపం వచ్చేసింది.

అప్పుడు ఉదయనుడు ఆ కన్యలను తన సోదరులకు చూపుతూ, "చూచారా, చిత్రం! మనం ఎవరికోసం వెదుకుతున్నామో ఆ రాజకుమార్తెలే వీరు. కనుక మనం వచ్చిన పని అయినట్టే. ఇక వీరిని తీసుకుని మనం ఈ మాయాభవనంనుంచి బైటపడే మార్గం చూడాలి" అన్నాడు.

అందుకు సుహాసిని "అది అంత తేలికైన పని గాదు. మమ్మల్ని రక్షించటం మాట అలావుంచి ముందు మీ ప్రాణాలు కాపాడుకోవటానికి యిక్కడినుంచి బైట పడగలిగితే......" అని యింకా ఏమో చెప్పబోతుండగా ఒక పెద్ద సుడిగాలి ప్రారంభమైంది. అప్పుడు సుహాసిని "అడుగో, వాడు వస్తున్నాడు. ఈ సుడిగాలి దానికే గుర్తు. ఇక మేము తిరిగి కొలను లోకి పోతాం. మరి మీ గతి ఏమిటి? క్రిందటిసారిలాగా హంసలుగా మార్చినా వాడు మిమ్మల్ని పట్టివేయగలడు. మరి ఎలా తప్పించుకుంటారో జాగ్రత్త" అని చెబుతూ సుహాసిని తన చెల్లెళ్లతో సహా కొలనులోకి పోయింది.

వెంటనే ఉదయనుడు తనవద్ద వున్న తెల్ల భస్మం తనపైనా సోదరులపైనా చల్లాడు. వెంటనే వాళ్లు మాయమై పోయారు. మరికొద్ది సేపటికల్లా సుడిగాలి తగ్గిపోయింది. ఆ వెంటనే ఒక బ్రహ్మాండమైన గద్ద కొలనుఒడ్డున వచ్చి వాలింది. కాని చిత్రం! ఒడ్డున వాలుతూనే దానికి గద్దరూపం పోయి ఒక భయంకరమైన రాక్షసాకారంతో నిలబడింది.





ఆ రాక్షసుడు అలా నిలబడగానే కొలనులో వున్న హంసలన్నీ రెక్కలు రెపరెప కొట్టుకొంటూ వచ్చి బారులు తీర్చి ఒడ్డు దగ్గరగా నీటిలో నిలిచినై. రాక్షసుడు ఒక్క క్షణంసేపు వాటివంక పరీక్షగా చూచి ఆ వెంటనే తిరిగి గద్దరూపంలో రివ్వున ఆకాశమార్గాన వెళ్లిపోయాడు.

ఇదంతా జరిగేటప్పటికి బాగా చీకటి పడింది. ఉదయనుడు తన భస్మం సహాయంవల్ల తనకూ సోదరులకూ మామూలు స్వరూపాలు తెప్పించుకున్నాడు. అప్పటికి మూడు రోజులైంది వాళ్లు తిండితిని. అందువల్ల ముందుగా తమదగ్గిర వున్న తువ్వాలు సహాయంతో పళ్లూ ఫలాలూ సృష్టించుకుని పొట్టలు నింపుకొన్నారు. తర్వాత కపల కన్యలు తిరిగి బైటికి వస్తారేమోనని కొంత సేపు ఎదురుచూచారు. కాని ఎంతసేపటికీ వాళ్లు రాకపోయేసరికి, యిక ఆ రాత్రికి ఎలాగో అక్కడే గడపవలసి వుంటుందని నిశ్చయించుకున్నారు. మామూలు రూపంతో వుండటం క్షేమం కాదని వాళ్లు భస్మం మహిమవల్ల తిరిగి అదృశ్యరూపం పొంది అక్కడే వుండిపోయారు.

తెల్లవారింది. కొలనులోంచి కపల కన్యలు బైటికి రావటమూ, మన కపల సోదరులు తిరిగి మామూలు స్వరూపం పొందటమూ ఒక్కసారిగా జరిగింది.

అప్పుడు ఉదయనుడు సుహాసినిని అడిగాడు: "అయితే ఈ రాక్షసుడు తిరిగి ఎక్కడికి వెళ్లాడు? మళ్లీ ఎప్పుడు వస్తాడు?" అని.

"ఎక్కడి కేమున్నది. వేటకి వెళ్లివుంటాడు. వేట అంటే జంతువుల వేటకాదు. 'కపలల వేట'" అని బదులు చెప్పింది సుహాసిని.

"కపలల వేట ఏమిటి?" అని మళ్లీ ప్రశ్నించాడు ఉదయనుడు.

"అదొక చిత్రమైన రహస్యం. ఈ రాక్షసుడు ఒక దేవిని ఆరాధిస్తున్నాడు. ఆ దేవియొక్క మహిమవల్లనే ఈ మాయా భవనం నిర్మించగలిగాడు. ఇందుకుగాను వాడు దేవికి యాభైమంది కవలల్ని బలి యివ్వాలి. ఈ బలి పూర్తి అయిందంటే దేవి వాడికి అన్ని మహిమలూ ప్రసాదించటమేగాక మరణం అనేది లేకుండా కూడా వరం యిస్తుంది. ఇప్పటికి నలభై ఏడుగురు కవలలు మాత్రమే వాడికి చిక్కారు. 'తక్కినవారు ఎప్పుడు చిక్కుతారా ఎప్పుడు బలి అర్పించి దేవియొక్క వరం పొందుతానా' అని వాడు ఒక్క క్షణం కూడా స్తిమితంలేక యిలా నిత్యమూ గద్ద రూపంలో ప్రపంచం అంతా చుట్టి వస్తుంటాడు" అని రాక్షసుడిని గురించిన గుట్టు కాస్తా వెల్లడించింది సుహాసిని.

ఇదంతా మన కవల సోదరులు ఎంతో శ్రద్ధగా చెవులు రిక్కించి విన్నారు. అంతా విని, "ఆహా! ఎంత అదృష్టవంతులం? మేము ముగ్గురం వాడికి చిక్కివున్నట్టయితే ఈ రోజుతో వాడి వేటా పూర్తి అయేది. బలీ సంపూర్ణమయేది సుమా!" అన్నాడు ఉదయనుడు.




"అదెలాగ? మీరూ కవలలేనా?" అని ఆశ్చర్యంతో అడిగారు కవలకన్యలు.

"అవును. వాడికి కావలసిన మనుష్యులమూ, మిమ్మల్ని రక్షించవలసినవాళ్లమూ మేమే అయామే అని విచారిస్తున్నాను" అన్నాడు ఉదయనుడు.

"అలాగైతే మీరు మరీ జాగ్రత్తగా మసలుకోవలసివుంటుంది" అని హెచ్చరించింది సుహాసిని.

"అవును. అసలు రహస్యం ఇప్పుడు తెలిసింది కనుక యికముందు ఉండవలసిన జాగ్రత్తలోనే వుంటాం. కాని ఎలాగైనా యిక్కడినుంచి బైటపడే మార్గం ఆలోచిం

చాలి కదా? ఈ చోటు అంతా మాయా జాలంతో నిండివున్నట్టు తెలుస్తోనేవుంది. అందువల్ల యిక్కడినుంచి బైటపడటంలో మనం ఎదుర్కోవలసిన కష్టాలు ఏముంటయ్యో తెలియజేస్తే వాటికి తగిన ఉపాయం ఆలోచిస్తాము" అన్నాడు ఉదయనుడు.

అందుకు సుహాసిని—"అన్నింటికన్నా ముఖ్యమైన విషయం ఒక్కటే వున్నది. అది ఏమిటీ అంటే మీరు ఆ రాక్షసుడి కంటబడకుండా వాడి భూగృహంలో ప్రవేశించగలిగితే సరి" అన్నది.

ఇది విన్న ఉదయనుడు "ఒస్, ఇదొక ఘనకార్యమా. మాదగ్గరవున్న భస్మాలవల్ల మేము ఎలా అదృశ్యరూపం పొందగలుగుతున్నదీ మీరే చూస్తున్నారుకదా?" అని ప్రశ్నించాడు.

అందుకు సుహాసిని—"మహా గొప్ప ఉపాయం కనిపెట్టావే! ఇంకా నయం ముందుగా చెప్పావు కనుక తెలుసుకోగలిగాను. నీ భస్మాలూ అంజనాలూ వాడి భూగృహంలో పని చెయ్యవు. వాటి మహిమ అల్లా యిక్కడ ఉన్నంతవరకే. కనుక వాటి ఆశ పెట్టుకోబోకు" అన్నది.

ఎప్పుడైతే ఈవిషయం విన్నారో అప్పుడు మన కవలలకు అదివరకున్న ధైర్యం కాస్తా జారిపోయి తెల్లమొగం వేశారు. వాళ్ల విచారం కనిపెట్టిన సుహాసిని, 'అలా అధైర్యపడతారేం, బుద్ధిబలం ఉపయోగించి ఏదైనా ఉపాయం ఆలోచించాలి?" అన్నది.

"ఆలోచించేందుకైనా వ్యవధి ఉండాలి కదా!" అన్నాడు ఉదయనుడు.

అందుకు సుహాసిని—"నిజమే. నిదానంగానే ఆలోచించాలి" అన్నది.

---

[కవల సోదరులు ఉపాయం ఏదైనా ఆలోచించగలిగారా? రాక్షసుడి చేతుల్లో పడకుండా వాళ్లు తప్పించుకోకలిగారా? ఈ మొదలైన మరికొన్ని చిత్రాలు వచ్చేనెల.]






అనంతపురం జిల్లాలో 'బుక్క రాయ సముద్ర'మనే ఒక గ్రామమున్నది. ఆ వూరిలో గొప్ప చెరువు ఒకటున్నది.

ఒకయేడు వర్షకాలం ఆ ప్రాంతంలో అతివృష్టిగా వానలు కురిశాయి. ఎడతెరపి లేకుండా అహోరాత్రాలు అలా కురిసే వర్షానికి జనమంతా హడలిపోయి, "ప్రళయకాలం ఇప్పుడే వచ్చేసిందా!" అని అనుకొని ప్రాణాలు పిడికిట్లో పెట్టుకునివున్నారు.

ఆ వర్షానికి గ్రామంలోని చెరువు నిండిపోయి, గట్టుకి ఎగదాసింది. ఈ పరిస్థితి చూచి గ్రామస్థులు "అయ్యో దేముడా ఇంకేమున్నది! ఇంతవరకు వచ్చినతర్వాత గండి వేయకుండా గట్టు నిలిచివుంటుందా! ఆ కాస్తపనీ జరిగిందో, ఈగ్రామమే కాదు, చుట్టుపక్కల ఎన్నో పల్లెలు గోవిందా అని మునిగిపోవక తప్పదు. అలా మునిగిపోవటమే తటస్థించినపక్షమందు హరిహరీ! ఎంత పశు నష్టం! ఎంత జననష్టం! ఎన్ని జీవాలు మట్టి కలిసిపోతై! ఎన్ని కుటుంబాలు కూలిపోతవి? దేముడు ఎందుకిలా భీకర స్వరూపం తాల్చాడో? అకారణంగా మరణించటానికి ఇంతమందీ చేసుకున్న పాపం యేమిటో?" అని పరిపరివిధాల యోచనలు చేయసాగారు.

జనమంతా ఈవిధంగా హాహాకారాలెత్తిపోతూవున్న సమయంలో ఒకనికి మైకము కమ్మి, ఆ మైకంలో ఆకాశవాణి "ఓయి అబ్బాయీ! మీ గ్రామంలో వుండే ముసలమ్మ అనే ఆమెను బలి యిచ్చినట్టయితే ఈ వర్షాలు వెంటనే ఆగిపోతాయి: ఆపద తొలగిపోతుంది" అని పలికినట్టయిందట:

కర్ణకఠోరమైన ఈ మాట విన్నవాళ్లం దరకూ వళ్లు జల్లుమన్నది. ఏమీ అంటే ముసలమ్మ అనగా వృద్ధురాలు కాదు.

టి. విశాలాక్షి, బొంబాయి



పడుచుదే. ఆమె పేరుమాత్రమే ముసలమ్మ. ఈ ముసలమ్మ మంచి ఇల్లాలు. రూపసి. అత్తమామలపట్ల వినయవతి, భర్తపట్ల అనుకూలవతి. పైగా ఉదారబుద్ధిగల వివేకవతి. ముసలమ్మ అంటే ఊళ్లో అందరకూ ప్రాణమే. అంతగా అందరకూ ఇష్టురాలై తలలో నాలుకగా మసలుకొంటూ వున్న ముసలమ్మ బలి కావటమా? ఎవరు భరించగలరు ఇటువంటి మాట?

ఐతే—ఊళ్లో అందరూ కంగారుపడి తలకొకవిధంగా అనుకొంటున్నారు కాని, ఈ మాట చెవినిపడినప్పుడు ముసలమ్మ మాత్రం యేమీ కలతచెందలేదు.

"ఈ వార్త యేమిటి, పిడుగులాగావచ్చి పడిందే!" అని గ్రామస్థులు పెద్దమర్రికింద కూడి విచారిస్తూవుండగా, ముసలమ్మ అక్కడికి వచ్చి, 'అయ్యా ఎందుకలా విచారిస్తారు? పుట్టిన ప్రతి జీవుడూ గిట్టక తప్పదుకదా! ఈ పరమసత్యాన్ని రోజూ మన కళ్లతో మనం చూస్తూనే ఉన్నామే! అటువంటప్పుడు చావంటే ఎందుకు భయం? బ్రహ్మ రాసిన ఆయుస్సు చెల్లి పోగానే మహారణ్యంలో దాక్కున్నప్పటికీ పాశం వేసి లాక్కుపోతాడు యమధర్మ రాజు. కనుక, పరమేశ్వరుని అజ్ఞ యెప్పు డవుతుందా అని నిరీక్షిస్తూ, అటువంటి తరుణం రాగానే 'ఇదిగో మహానుభావా! నీ పాదాలచెంతకు వచ్చేస్తున్నా' అని చెప్పి సంతోషంగా వెళ్ళిపోవటానికి సిద్ధపడి వుండాలి. అంతే కాని, ఒక్కలిప్తకూడా ఇక్కడ నిలవటానికి మనయిష్టమా?—ఇంతకూ ఈ భూలోకమనేది మరొక ఉత్తమలోకానికి మనల్ని చేర్చే ఒక నావ వంటిది. కాబట్టి, మనం ఇక్కడ ఉండ వలసినన్నాళ్లూ మంచిగా, చేతనైనంత వరకూ పరోపకారంచేస్తూ కాలంగడపి, 'పిలుపు' రాగానే వెళ్లిపోవాలి. అదీగాక,

ఎంతకాలం బ్రతికివుంటే తృప్తి తీరు తుంది? దీనికొక హద్దున్నదా? అందుకనే 'కాకిగా కలకాలం బతికేకంటే హంసగా అరునెలలు బతికితే చాలు.' నంటారు పెద్దలు: ఇప్పుడు అకాశవాణి నన్ను రక్షుం టున్న దంటే నేను తరించగల గొప్ప తరుణం వచ్చిందని సంతోషిస్తున్నాను. ఇంతమంది జనుల క్షేమంకోసం బలి కావ టంకంటె భాగ్యం మరొకటి వుంటుందా? ఈ అవకాశం నా పుణ్యంకొద్దీ కలిగింది కాని, సామాన్యులకు లభిస్తుందా? ఇటు వంటి మరణం కావాలంటే దొరికేదా? కనుక ఈవిషయంలో ఎవ్వరూ విచారింప కూడదు" అంటూ చెప్పింది.

నిబ్బరంగా, నిర్భయంగా, నిర్విచారంగా ఆ ముసలమ్మ చెప్పిన మాటలు విని పిన్నలూ పెద్దలూ నిర్ఘాంతపోయారు!

ఈ వార్త క్రమంగా ప్రాకిపోయి ఆమె అత్తమామలకు తెలియగానే వారు "తల్లీ! నీవు కేవలమూ భూదేవతవు కాని సామాన్యురాలివి కాదు. నీవు లేకుండా నిమిషంకూడా మేం బతకలేము. కనుక, నీవు పోవద్దు మా అమ్మా!" అంటూ, ముసలమ్మను కౌగిలించుకుని యేడువ



సాగారు. ఆమె భర్త అనేకవిధాల బతిమ లాడి, కంటికి మింటికి ఏకధారగా యేడ్చి పోయాడు.

ఎవరేమి చెప్పినా, ముసలమ్మ మనసు మారలేదు. బంధువులు బ్రతిమాలినా, భర్త పలువిధాల విలపించినా ఆమె నిశ్చ యాన్ని మరల్చుకోలేదు. "నా ఒక్క జీవుడు పోతే పోనీ, లోకానికి ఉపకారం చేయాలి. ఇంతమంది లోకుల ప్రాణాలను కొదువపెట్టి నేను బ్రతకటంలో సౌఖ్య మే మున్నది? లోకోపకారంకోసం బలి ఐన ఇల్లాళ్ళను గురించి పురాణాలు విన్నాము, చరిత్రలు చదివాము. నాకూ వారివలెనే

పరులకోసం ప్రాణాలు అంకితం చేయవలె నని కుతూహలంగావున్నది. ఇలా అంకితం చేయుటమే నాకు జీవితానందం" అని ఆమె తన నిశ్చయాన్ని వెల్లడించింది.

ఈ నిశ్చయంతో ముసలమ్మ చక్కా తల దువ్వుకుని, మొగంనిండుగా పసుపు రాచుకుని, పెద్ద కుంకుమ బొట్టుపెట్టుకుని, పసుపుచీర కట్టుకొని బాజాభజంత్రీలతో బయల్దేరి చెరువుపద్దకు వచ్చింది.

ఇసుకవేస్తే రాలకుండా మూగేశారు జనం. ఆకు అల్లాడినా వినపడటంలేదన్న మాట. అంతటా నిశ్శబ్దం ఆవరించింది. ఆ చెరువుదగ్గిర అందరి దృష్టి ఇప్పుడు మందహాసంతో నిలబడివున్న ఆ ముసలమ్మపైనే వున్నది!! అపూర్వమైన ఈ చిత్ర మేమిటా అని ఆశ్చర్యంతో చూస్తూవున్నారు.

అంతట ముసలమ్మ, మనసులో ఎట్టి జంకుగొంకులూ లేక కలకల్లాడుతూవున్న ముఖంతో నీటివొడ్డున మహాలక్ష్మిలాగా నిల్చుంది. అత్తమామలకు భక్తితో నమస్కరించింది. పెద్దలందరకూ దణ్ణం పెట్టింది. మగనికి తుదిసారి ప్రణమిల్లి 'సెలవు తీసుకొంటున్నా' నన్నది. అత్తారింటికి వెళ్ళే ఆడుపడుచులాగ అందరినీ అనుజ్ఞకోరింది. వాసదేమునికి మొక్కింది. కన్నులు మూసికొన్నది. అగ్నిప్రవేశం చేయబోయే సీతమ్మవారిలాగా, కారుచిచ్చులో ఉరికే చంద్రమతిలాగా గభాలున చెరువులోకి దుమికి, మాయమైంది!!!

ఆకాశవాణి చెప్పినట్టుగా, ముసలమ్మ ప్రాణత్యాగంవల్ల ఆయేడు వర్షాలు నిలిచిపోయినాయట. ఇప్పటికీ ఆ వూరి చెరువు కట్టకు 'ముసలమ్మ చెరువుకట్ట' అని పేరుంది. బుక్కరాయసముద్ర ప్రాంతంలోనివారంతా నేటికిన్నీ ఆ ముసలమ్మను ఒక అమ్మవారిలాగా కొలిచి, ఆరాధించి, ఏటా పొంగళ్ళూ, పిండివంటలూ చేసి ఆమెకు నైవేద్యం పెడతారు.






కపిలేశ్వరపురంలో అక్కిరాజుగారు ఒక సంపన్నగృహస్థు. ఆయన భార్య అక్కమ్మ. వారికి సిరీ, సంపదా లోటులేదు. అదృష్టం కొద్దీ పుట్టిన ఐదుగురు కొమాళ్ళూ పెరిగి పెద్దవాళ్ళయారు. వాళ్ళకు లక్షణంగా పెళ్ళిళ్ళుకూడా జరిగినై. హాయిగా కాపరాలు చేస్తూవున్నారు.

అక్కమ్మగారి కోడళ్ళల్లో మొదటి నలుగురి పుట్టింటివారూ సామాన్య కుటుంబీకులే. కడసారివాడి భార్య సావిత్రి మటుకు జిల్లా జడ్జీగారి అమ్మాయి కావటంచేత ఆ పిల్లను అత్తగారూ, తోడికోడళ్ళూ, ఇరుగుపొరుగులూ అందరూ అపురూపంగా చూస్తూవచ్చారు.

'అక్కమ్మగారి చిన్నకోడలు అందాలబరిణట. పైగా జడ్జీగారి కూతురుట!' అంటూ అమ్మలక్కలు నలుగురూ చెప్పుకొనేసరికి, ఈ వర్తమానం ఆనోటా ఆనోటా పాకిపోయి విళ్లక్కుపేటలో వుండే వనజాక్షమ్మగారికి అందుకుంది. వనజాక్షమ్మగారంటే అమ్మో, సామాన్యురాలా? ఆమె ఒక కోటీశ్వరుని కూతురూ, జమీందారుగారి భార్య అయివున్నదాయె!

ఆవిడకు సావిత్రిని చూచివద్దామని సరదాపుట్టి, ఒకనాడు అక్కమ్మగారింటికి బయల్దేరింది. ఎప్పుడూ ఎక్కడకూ వెళ్ళని వనజాక్షమ్మ తమ గృహానికి వచ్చిందంటే, ఎంతగొప్ప!

అందువల్ల అక్కమ్మగారు నిజంగా గర్వపడింది. గొప్పవాళ్లకుచేసే మర్యాదలన్నీ లోపంలేకుండా వనజాక్షమ్మకు అక్కమ్మగారు చేసింది.

అన్నీ అయినై. ఇక తాంబూలం ఇయ్యవలసిన ఘట్టం వచ్చింది. వనజాక్షమ్మ వంటి శ్రీమంతురాలికి బంగారపు పళ్లెంలో గాకుంటే మానె, వెండిపళ్లెంలోనైనా

కె. చిట్టి, పార్వతీపురం



ఇవ్వకపోతే ఏమంత బాగుంటుంది గనుక? అందుకని అక్కమ్మగారు ఆలోచనలో పడింది.

ఉన్నట్టే వుండి, జేవురించిన ముఖంతో అవిడ కంఠమెత్తి "ఏమైందర్రా వెండి పళ్లెం! పోయినట్టే?" అని హుంకరించింది.

"ఎంచక్కటి బంగారు పువ్వులుకూడా ఉండేవి, చుట్టూతా!" అని విస్తుపోయింది పెద్దకోడలు.

"పువ్వులమాటకేం, ఆ నగిషీ? కాష్మీర్ పళ్ళేల నమూనా కన్నులకు కట్టేటట్టు దింపేశాడుకదూ, పనివాడు!" అంటూ ఆశ్చర్యం తెలిపింది రెండోకోడలు.

"నగిషీలకేమిటి అక్కా!–వాడు పెట్టిన మెరుగు అసలీ ఇండియా మొత్తంమీద మరెవ్వడైనా పెట్టగలడా అని అడుగుతా" అని సవాలుచేస్తూ మాటాడింది, మూడో ఆమె.

"ఏమో నమ్మా!—మన వెండిపళ్లెం, దానికదేసాటి! ఆ మోస్తరుగా తయారు చేయించుకోవాలని చెప్పి ముచ్చటపడి ఎందరెందరు చూచిపోవటంలేదు? ఒక్కళ్లవల్లనైనా అయిందీ?" అని తెగ వర్ణించింది, నాలుగో కోడలు.

"ఆ ఒక్క రత్నమూ వేయబట్టి రెండు వేల ఐదువందలూ దాటిపోయింది. ఆహా, పళ్ళమంటే పళ్ళమా..." అంటూ అక్కమ్మగారు మళ్ళీ ఒకసారి ఆశ్చర్యం తెలుపుతూ అందుకుంది.

ఇలా అక్కమ్మగారూ, కోడళ్లూ అతిగా ఆ వెండిపళ్లాన్ని గురించి వర్ణించటంలో ఒక అరగంటసేపైంది. చుట్టపుచూపుగా వచ్చిన ఆ వనజాక్షమ్మ ఎంతసేపని కూర్చుంటుంది? పీటమీదనించి లేచి ఒక్కసారి ఆవులించింది. ఇది చూచి అక్కమ్మగారు ఆమెవద్దకువచ్చి "అయ్యో, చాలాసేపైందమ్మా, మిమ్మల్ని కూర్చో

పెట్టేశాను మతిమాలినదాన్ని..." అని తనుచేసిన అలస్యాన్ని కప్పుకోబోయింది.

"దానికేవిటి, పిన్నిగారూ! మరి నేను వెళ్ళొస్తా" అన్నది వనజాక్షమ్మ.

"అయ్యో! తాంబూలం పుచ్చుకోకుండా వెళతారా? కుర్రకుంకలు వెండిపళ్లెం ఎక్కడెట్టేశారో! రవ్వలు పొదిగిన పళ్లెమండీ. రెండువేలైదువందలైంది..." అంటూవుండగా "అఁ, మనలో మనకి వెండిపళ్లా లెందుకు పిన్నిగారూ? ఈ లాంఛనాలన్నీ దేనికి? చేతికి అందిద్దురూ తీరిపోతుంది" అన్నది వనజాక్షమ్మ.

"మంచిమాటే చెప్పారు. ఇవాళ యిదీ ఐంది, రేపు మరొకటవుతుంది. ఇంతకూ అసలు ఏమైందో తేల్చుకోవద్దూ" అన్నది అక్కమ్మగారు అవొకలాగ మొహంపెట్టి.

"ఎక్కడికీ పోదు పిన్నిగారు మీకంగారుగాని, మీదేం తక్కువసామానా? ఎందులో కలిసిపోయిందో! ఎత్తుకుపోవటానికి పైవాళ్లు ఎవళ్ళొస్తారు చెప్పండీ, పులిలాగ మీరు మసులుతూవుంటే" అన్నది వనజాక్షమ్మ ధైర్యం చెబుతూ.

"అమాటా నిజమేలెండి. ఐనా, మా దాసీది వుందా. యిక్కడికి పదేళ్ళాయె,



ఎన్నడూ చీపురు ముల్లుకూడా పట్టుకుపోయి యెరగదు" అన్నది అక్కమ్మగారు.

"మరేం కంగారుపడకండి పిన్నిగారూ, స్తిమితంమీద అదే దొరుకుతుంది. ఈ మాటు నేను మళ్ళీ వచ్చేటప్పటికి, వెండిపళ్లెమేవిటి, మన సావిత్రి నాన్నగారు బంగారప్పళ్లెమే చేయిస్తారు. అందాకా ఆ ప్లాస్టిక్ పళ్లెంలో పెట్టి యిద్దురూ, సరిపోతుంది. నేనేం పైదాన్నా, ఏమన్నా అనుకునేందుకు" అన్నది వనజాక్షమ్మ.

అమె చెప్పిన మాటతో తృప్తిపడి అక్కమ్మగారు తాంబూలం ప్లాస్టిక్‌పళ్లెంలో తెచ్చిపెట్టింది. నలుగురూ కాస్సేపు

కూర్చుని పిచ్చాపాటీ మాటాడుకున్నారు. వనజాక్షమ్మ లేచి వెడుతూ 'మళ్లీ ఆదివారం మీరు తప్పకుండా మాయింటికి రావాలి సుమండీ!' అని మరీమరీ చెప్పిపోయింది.

మళ్లీ వారంనాడు వనజాక్షమ్మగారింటికి అక్కమ్మగారు వెళదామనుకుంది గాని వీలులేక తనకు బదులు పెద్దకోడలిని పంపించింది. పెద్దకోడలు సీత గుమ్మంలో అడుగు పెట్టడంతోనే వనజాక్షమ్మ "ఔనే, సీతా! మీ వెండిపళ్లెం అగపడిందా, లేదా!" అని ఆత్రంతో అడిగింది.

"ఆఁ—ఇంకో నెలరోజులకల్లా అదే కనబడుతుంది" అంటూ పకపక నవ్వింది. వనజాక్షమ్మకు యిదేమీ అర్థంగాక మళ్ళీ మళ్ళీ అడిగింది. అందుకు సీత "అసలు మాకు వెండిపళ్లెం వుంటేగాదుటండీ, పోవటానికీ?" అంటూ బదులుచెప్పింది.

"ఓయి మీయిల్లు బంగారంగానూ! ఏమీ లేనిదానికే అంత హంగామాచేసిందే మీ అత్తగారూ?" అని ఆశ్చర్యపోయింది వనజాక్షమ్మ.

"ఔను. అలాగే చేస్తూవుంటుంది హంగామా. లేకపోతే, మీలాటివాళ్ళు వచ్చినప్పుడు మా మర్యాద ఏంనిలబడుతుంది? ఇంకెందుకులెండి, కళ్లుమూసుకుంటే ఒక్క నెల్లాళ్ళల్లో మా సావిత్రి నాన్నగారు వెండిపళ్లెం పంపిస్తున్నామని ఉత్తరం రాశారు. మా యింటిల్లిపాటీ యింక మాయ నాటకం ఆడవలసిన బాధ తప్పిపోతుంది" అంటూ ఇంటిగుట్టు బయటపెట్టింది, సీత.

"ఎంతలేసి చిత్రమైన మనుషులున్నారమ్మా లోకంలో! మీ యింటికి నేను రావటం పొరపాటే అయింది," అంటూ ముక్కుమీద వేలేసుకుంది, వనజాక్షమ్మ.

"అలా అనుకోకండి వదినగారూ! మీరు రాబట్టే మీ నోటి వాక్యాన, యింత చప్పున మాకు వెండిపళ్లెం అమరటానికి వీలైంది" అని బదులు చెప్పింది సీత.






గోదావరి మండలంలో ద్రాక్షారామ అనే క్షేత్రం ఉన్నది. పూర్వకాలమందు అక్కడ వేములవాడ భీమకవి అనిచెప్పి ఒక గొప్ప కవీశ్వరుడు ఉండేవాడు. ద్రాక్షారామలో వెలిసిన భీమేశ్వరస్వామి అనుగ్రహంవల్ల జన్మించటంచేత, స్వామి పేరే ఆ కవికి వచ్చేసిందని చెప్పుకొంటారు.

భీమకవి వరప్రసాది. అందుకని స్వామి అతనికి అద్భుతశక్తులు యిచ్చాడనీ, ఆ మహిమలవల్ల ఆతడు శత్రువులను గెలిచి, గొప్పవాడయాడనీకూడా వదంతి ఉన్నది. భీమకవికి గల మహిమలలోకెల్లా, ముఖ్యమయింది చెప్పనలవికాని వాక్శుద్ధి. అనగా, అతని నోటివెంబడి ఏమాటవస్తే అది జరిగితీరవలిసిందే నన్నమాట.

ఇలాగా తన ప్రతిభా, పాండిత్యమూ ప్రకటించుకొంటూపోయి, భీమకవి అనేకమంది ప్రభువులను దర్శించి, వారిని మెప్పించి ఎన్నో బహుమతులుపొందుతూ ఉండేవాడు. ఆయన అలా పర్యటనం చేసుకొంటూ పోయిపోయి, ఒకప్పుడు సజ్జనగరాన్ని పాలించేటటువంటి కళింగ గంగు అనే రాజును దర్శించబోయాడు.

'ఫలానా వేములవాడ భీమకవి ఏలినవారి దర్శనార్థం వచ్చివున్నాడు, ఏమిటి అనుజ్ఞ?' అని వర్తమానం పంపించాడు.

మరి కొద్దిసేపటికి నౌకర్లువచ్చి, "రాజావారికి ఇప్పుడు పనిసందడి ఎక్కువగా ఉన్నది. కనుక, దర్శనమివ్వటానికి వీలులేదు" అని బదులు తెచ్చారు.

ఈ జవాబు వినగానే భీమకవి చుర్రుమన్నాడు. అసలే ఆయన తిక్కవాడు, ముంగోపిన్ని. అటువంటప్పుడు ఈ మోస్తరుగా బదులుచెబితే ఆయనకు ఎంతకోపం వస్తుందో చెప్పేదేమిటి?—"ఈ రాజెంత, ఈతని బ్రతుకెంత? నావంటివాడు వస్తే

ముద్దా సోమప్పశాస్త్రి, పరశువాకం



దర్శన మివ్వటానికే తీరిక లేకపోయిందా? ఎందుకులే, పాపం! ఈ సందడిఅంతా కొద్దికాలంలోనే తగ్గిపోతుందని చెప్పు" అని అంటూ శపించి వెళ్లిపోయాడు.

భీమకవి వెళ్లిపోయిన మరికొద్దికాలానికే కళింగుగంగు రాజ్యం అరాచకం కాజొచ్చింది. అతని మంత్రులు కుట్రలు పన్నారు, ఉద్యోగస్థులు లంచాలుమరిగారు, సేనాధిపతులందరూ ద్రోహం తలిచారు. ఇన్నింటికీ తోడు అతని అజాగ్రత్త ఎక్కువైంది. స్థితి ఇలావుంటే శత్రురాజుకు ఎంత లోకువ? ఇతని గుట్టుమట్టులన్నీ తెలుసుకొనివున్న శత్రురాజు అదునుచూచి దండెత్తి కళింగగంగును అతి సులువుగా ఓడించి, రాజ్యం ఆక్రమించేసుకున్నాడు.

ఇంకిప్పుడు గంగు చేయగల దేమున్నది? తన భార్యా బిడ్డలను అత్తవారింట దిగబెట్టి, 'బ్రతికివుంటే బలుసాకు...' అన్నట్టుగా, తల దాచుకోవడానికని ఎక్కడికో పారిపోయాడు. ఈమట్టున కంటబడితే శత్రురాజు తనను వెతికించి పట్టుకోవచ్చుననే భయంతో వేషంకూడా మార్చి, మారుపేరు పెట్టుకుని, అజ్ఞాతంగా మసలజొచ్చాడు.

అతడు అనుకున్నట్టుగానే శత్రురాజు చారులనుపంపి కళింగగంగుకోసం వెతికించాడు. ఎన్నాళ్లకూ జాడా జబాబూ తెలియకపోయేసరికి, "ఇంకా యేమిటి, ఈపాటికి వాడు ఎక్కడో చచ్చేవుంటాడు, ఇక మనకు ఫరవాలేదులే" అని తలచి, గుండెమీద చెయ్యి వేసుకుని హాయిగా నిద్రపోసాగాడు.

ఇక్కడ పాపం, కళింగగంగు ఏ సత్రంలోనో ఇన్ని మెతుకులు తింటూ, కనపడిన మఠంలో కునుకుతీస్తూ, కాలు సాగినంతవరకూ తిరుగుతూ, రోజొక యుగంగా గడుపుతూవున్నాడు. ఒకనాటిరాత్రి అతడు ఒక పట్టణం చేరుకుని, అక్కడి సత్రానికి

పోతూవుండగా, అప్పుడే వర్షం కురవటం చేత, కళింగగంగు కాలుజారి ఒక గోతిలో పడ్డాడు. గోతిలోపడిన కళింగగంగు ఒక పెద్ద నిటూర్పువిడిచి, "హయ్యో, దైవమా! అంతటి రాజ్యం ఏలిన సార్వభౌముడికి కాలి దివిటీ ఐనా లేకపోయెగదా!" అని నిస్పృహతో గట్టిగా పలికి, గోతిలోనుంచి మెల్లగా యివతలకి వచ్చాడు.

అప్పుడు ఆ దారిని పోతూవున్న ఒక మనిషి "నీ వెవరయ్యా?" అని అడిగాడు.

అందుకు గంగు "నేనా, వేములవాడ భీమకవి చేసిన జోగిని!!" అని జవాబు చెప్పాడు.

వెంటనే ఇతడు ఫలానా అని గ్రహించి, "ఓయి కళింగగంగూ! నీవు చెప్పిన ఆ వేములవాడ భీమకవిని నేనే. పాపం, నా శాపంవల్ల నీకు ఇంత కష్టం కలిగిందని చాలా విచారపడుతున్నాను. కానీలే, ఐన దేదో అయింది. నిన్ను క్షమించాను. మళ్ళీ పున్నమి వెళ్లిన షష్టినాటికి నీ రాజ్యం నీకు వచ్చేస్తుంది. భయపడకు. వెళ్లు" అంటూ ఆశీర్వదించి, శాపం తిప్పివేశాడు.

భీమకవి వాక్శుద్ధికలవాడన్న సంగతి కళింగగంగుకి బాగా తెలుసు. ఐతేనేం?




పోయిన రాజ్యం మళ్లీ రావడమంటే మాటలా? రాజ్యం తెచ్చుకోవాలంటే ఎంత సిబ్బంది ఉండాలి? ఎంత ధనంకావాలి? చూడగా, తను ఏకాకిఐ పిచ్చిగా తిరుగుతూ వున్నాడాయె! ఇప్పుడేముంది చేతిలో?— ఏనుగులా, గుర్రాలా, సేనలా, ఆయుధాలా?—ఏ బలమూ లేకుండా ఎలా రాజ్యం సంపాయించటం?—వట్టి చేతులతో కూర్చుని ఉన్నవాడికి జయమెట్లా కలుగుతుంది? ఇది కేవలమూ అసాధ్యం, 'ఏదో మాటవరుసకు నన్ను ఊరడించటానికే భీమకవి ఇలా దీవించి ఉంటాడు కాని, నాకేమిటి మళ్లీ రాజ్యం రావట



మేమిటి?' అని మనసులో అనుకున్నాడు, కళింగగంగు.

ఈ నిస్పృహతో మామూలుగా ఊరూరా సంచారంచేస్తూ, మళ్లీ పున్నమివచ్చేసరికి సజ్జనగరం సమీపంలోవుండే ఒక గ్రామం చేరుకున్నాడు.

కళింగగంగు చేరుకొన్న ఆ గ్రామంలో ఒకచెట్టుకింద ఒకచిత్రం జరుగుతూవుంది. అది యేమిటీ అంటే— నాటకాలువేసే ఒక జట్టువాళ్లు అక్కడ కూడివున్నారు.

"పహవ్వా! అంతా బాగానేవుంది, అందరూ అమిరిపోయారు. రాజువేషగాడు ఒక్కడూ దొరికినట్టయితే మన అదృష్టం పండిపోనుగదరా!' అంటున్నాడు, ఆ జట్టుకిచెందిన నాయకుడు.

ఈ మాటవిని, కళింగగంగు "ఏమిటయ్యా, ఏమినాటకం వేస్తున్నారు? ఏ రాజువేషం వేయాలి?" అంటూ ఆత్రంతో ప్రశ్నించాడు.

అందుకు ఆ జట్టు నాయకుడు "అయ్యా! ఇప్పుడు సజ్జనగరాన్ని ఏలుతున్న రాజావారు, పూర్వం రాజుగావుండిన కళింగగంగు పొందిన కష్టాలనూ. పరాభవాలనూ, మారాజావారికికలిగిన విజయాలనూ చక్కగా వర్ణించివున్నాడు కవీశ్వరుడు. ఈ నాటకం రక్తిగా ఆడినపక్షమందు వెయ్యి న్నూటపదహార్లు బహుమానంతో సత్కరిస్తామన్నారు ప్రభువులు. మాకు అందరూ కుదిరినారు, కాని రాజువేషగాడుమాత్రం కుదరలేదు. అందుకని కాళ్లముందుకు వచ్చిన సొమ్ము నిష్కారణంగా పోతోందే అని విచారిస్తున్నా"మన్నాడు.

అప్పుడు కళింగగంగు "మీరేమీ విచారించకండి. నాకు ఆటాపాటా బాగావచ్చు. కాబట్టి రాజువేషం నేను వేస్తాను. ఐతే, నేను సరదాకోసం వేస్తున్నానేగాని, డబ్బుకోసంకాదు. మీరు నాకు ఒక్క దమ్మిడీ

కూడా ఇవ్వనక్కరలేదు. రాజావారు ఇచ్చే బహుమానాలన్నీ మీరే పుచ్చుకోండి" అని చెప్పాడు.

ఈ మాటలు విని ఆ జట్టు నాయకుడు అపరిమితానంద భరితుడయ్యాడు. తలవని తలంపుగా రాజువేషగాడు అమరిపోవటం, పైగా అతడు ఎంతమాత్రమూ ద్రవ్యాపేక్ష లేనివాడుగా ఉండటం—నిజంగా, ఎంత అదృష్టం!

"కాని, ఒక్క షరతున్నది: రాజు ఎక్కే గుర్రమూ, రాజుపట్టే ఖడ్గమూ—కావాలి నాకు. ఇవిఉంటేగాని నాటకం రక్తికట్టదు. అలా అయితేనే నేను వేషం వేస్తాను," అన్నాడు కళింగగంగు.

అందుకు నాయకుడు "ఆ సంగతి మాకుమాత్రం తెలియదా? అవి తీసుకు వచ్చి సిద్ధంగానే వుంచాము" అని వెంటనే బదులు చెప్పాడు. అప్పుడు గంగు నాయకునివద్ద రాజువేషగాడు వల్లించవలసిన కీర్తనలు, దరువులు, పద్యాలు రాసుకు పోయి, మరునాటికల్లా వప్పగించివేశాడు. డబ్బుకర్చు అక్కరలేకుండా ఇటువంటి తెలివైన వేషగాడు కుదిరినందుకు నాయకుడు ఎంతో సంతోషించాడు.



పంచమిరోజున నాటకం ప్రదర్శించటానికి ఏర్పాట్లు జరిగినై. రాజుగారి కోటలో ఆకాశమంతపందిళ్లు వేయించారు. వేలకొద్ది కాగడాలు వెలిగించారు. వెండి పిడి విసనకర్రలు పుచ్చుకొని ఇరుప్రక్కలా ఇద్దరు స్త్రీలు విసురుతూవుండగా, ప్రభువు వారు ఒక పెద్ద సింహాసనంమీద కూర్చుని కర్పూర తాంబూలం నమలుతూ సంతోషంతో నాటకం చిత్తగిస్తూ వున్నారు.

నాటకం ప్రారంభమైంది. చాలావరకు కథ నడిచింది. మరికొంచెంసేపట్లో కత్తి చేతపట్టిన రాజవేషధారి గుర్రంయెక్కి రంగంమీదికి టకటకమంటూ వచ్చేసరికి,

'ఇది వేషమా? నిజంగా కళింగగంగే తిరిగి వచ్చాడా?' అని సభలో అందరూ ఆశ్చర్య పోసాగారు. అచ్చు కళింగగంగులాగేవున్న ఆ విగ్రహంచూచి రాజు కూడా మొదట కలవరపడ్డాడు. కాని, కొంచెం స్తిమితం మీద, అది వేషమే తప్ప అసలు కళింగ గంగు అయివుండడని నిశ్చయించుకొని, నిశ్చింతగా కాలు మీద కాలు వేసుకొని వేడుక చూస్తూవున్నాడు.

కొంతసేపు కలాపమంతా రక్తిగా విని పించాడు, కళింగగంగు. చివరకు యుద్ధ ఘట్టం వచ్చేసరికి అతనిలో తీవ్రమైన పౌరుషమూ, ఉద్రేకమూ చెలరేగినై. ఒక్క సారిగా గభీమని గుర్రంమీదనుంచి దూకి, నిశ్చింతగా వేడుక చిత్తగిస్తూవున్న శత్రు రాజుమీద పడి, చేతనున్న ఖడ్గంతో అతని తలకాయ ఒక్క వేటున తెగనరికి అతడిని కిందికి లాగివేసి, తను సింహాసనం ఎక్కి కూర్చున్నాడు.

ఇంతలో ప్రజలు తమ రాజుని ఆన వాలుపట్టి, పాదాక్రాంతులయ్యారు. రాజ భటులు నిశ్చేష్టులై నించుండిపోయారు. ఇంతకాలం అష్టకష్టాలు అనుభవించి ఈవిధంగానైనా తిరిగి తన రాజ్యానికి తను వచ్చాడంటే అందరూ సంతోషించారు.

ప్రజలందరూ ఒకటైనప్పుడు ఇక శత్రు రాజు యేంచేయగలడు? అతనినీ, అతని సైన్యాన్నీ నిమిషంలో అవతలికి పారదోలి మరునాడే—అనగా షష్ఠినాడే—కళింగ గంగుమహారాజుకు సజ్జనగర ప్రజలు మళ్ళీ పట్టం కట్టారు. కళింగగంగు అప్పుడు మరి ఒకసారి భీమకవి వాక్శుద్ధిలోగల మహి మను గుర్తించి మెచ్చుకొన్నాడు.

నాటినించీ కళింగగంగుకి కవీశ్వరు లంటే గొప్ప గౌరవం యేర్పడ్డది. తన ఆస్థానానికి కవి అన్నవాడు వచ్చాడనేసరి కల్లా అమిత మర్యాదతో ఆదరించి సత్కా రించి పంపేవాడు.






వేళంగిపురంలో వెంకటాయ అనే పేద కుర్రవాడొకడుండేవాడు. వాడికి తల్లీ తండ్రీ లేరు. ఇల్లూ వాకిలీ, డబ్బూ దస్కం యేమీ లేవు. ఏరోజు కారోజు ఎవరింటికో ఒకరింటికి వెళ్లి, "అమ్మా, పేదవాణ్ణి. కాస్త భోజనం పెట్టి పుణ్యం కట్టుకోండి' అని అడిగేవాడు. దిక్కులేనివాడన్న జాలికొద్దీ వాళ్లు తిండి పెడుతూండేవారు.

'మధూకరపువాడికి మరిరెండు కూర' లన్నట్లుగా ఊళ్లోవాళ్ల దయవల్ల వెంకటాయకు రోజులు సుఖంగానే వెళ్ళాయి మొదట్లో. కాని ఎల్లకాలం ఒక్కలాగ వెడుతుందా? దేశంలో కరువొచ్చి, అన్ని పురాల్లో మల్లేనే వేళంగిపురానిక్కూడా రేషనొచ్చింది: దాంతోటి పెట్టగలవాళ్లూ, పెట్టలేనివాళ్లూ కూడా అడుక్కొని తినే పేదవాళ్లకి మొండి చెయ్యి చూపించటం మొదలెట్టేరు. ఇందువల్ల వెంకటాయ పని కీచయింది.

కాని వెంకటాయ బ్రతుకుతెరువు తెలిసినవాడు. కనుక, యిలాంటి కరువు కాలంలోకూడా తన బుద్ధి వినియోగించి ఏదోవిధంగా ఎక్కడో అక్కడ కడుపు నింపుకొనేవాడు. ఒకరోజునమటుకు ఎక్కడా ఏమీ లభించక, ఉత్తి గొడ్డుదినమైపోయింది, వాడికి. సాయంత్రం కావచ్చింది. 'ఈ రాత్రి పస్తే కామోసు' అని అనుకుంటూ రోడ్డమ్మటే నడిచిపోతున్నాడు వెంకటాయ.

అలా పోతూంటే రోడ్డుమీద దారిమధ్యని ఒక కాగితంముక్క కనిపించింది. దూరాన ఉన్న మునిసిపలు లాంతరు వెలుగులో ఆ కాగితం ఒక ఐదు రూపాయల నోటుకు మల్లే కనపడడంతో, వాడు ఆశపడి దాన్ని తీసుకుచూశాడు. చూస్తే ఏముందీ? అది మామూలుగా ఏదో రాసి ఉన్న కాగితం ముక్క! 'నా మొహానికి రూపాయి నోటు కూడానా?' అనుకొని పారేద్దామనుకుంటూ

అల్లంరాజు చినలక్ష్మిపతి, గొల్లప్రోలు




వుండగా ఆదారిని వస్తూఉన్న ఒకాయన 'ఏమిటబ్బాయదీ?' అని అడిగాడు.

'ఏదోనండి, రాసి ఉంది. చదవండి బాబూ, కాస్త' అంటూ వెంకటాయ దాన్ని ఆయనకి అందించాడు.

ఆయన చదివి, 'ఎవడికో డాక్టరిచ్చిన చీటీ. అజీర్తికి మందు. భోజనమైనవెంటనే పుచ్చుకోమని ఉంది' అంటూ కాగితం తిరిగి వెంకటాయకిచ్చేసి వెళ్లిపోయాడు.

'నాలాంటివాళ్లు తిండి లేక బాధపడుతూంటే, ఈ చీటీ పారవేసుకున్నవాడెవడో తిండి ఎక్కువై అజీర్తితో బాధపడుతున్నట్టుందే! లోకం పోకడ ఇలాగే నడుస్తున్నది కాబోలు' అనుకుంటూ వెంకటాయ ముందుకి నడిచాడు.

మరిరెండడుగులు వేసేటప్పటికి బంగారమ్మగారి గుమ్మం దగ్గిరకొచ్చాడు. ఆవిడ అప్పుడే భోజనం చేసి, విస్తరాకు పారెయ్యటానికి వీధిలోకొచ్చింది. ఆవిడ మొహం చూచేటప్పటికి వెంకటాయకి 'ఈవిడ జాలిగుండెకలది. ఏదైనా ఉపాయంవల్ల ఈ ఇల్లాలి మనస్సు కరిగిస్తే, ఉన్నదేదో పెట్టకపోదు' అనిపించింది. ఈ వుద్దేశంతో వాడు ఆవిడ చూసేటట్టుగా చేతులో ఉన్న కాగితాన్ని పరిశీలిస్తూ నిలబడ్డాడు.

ఇది చూచిన బంగారమ్మ, 'ఏమిట్రా అబ్బాయీ అది?' అని అడిగింది.

"డాక్టరిచ్చిన చీటీ అమ్మా. వంట్లో బాగుండక వెళ్లి అడిగితే రాసిచ్చాడు. అంతేకాదు. 'పేదవాడివి. మందు కొనటానికి నీకు డబ్బెక్కడొస్తుంది గనక' అని చెప్పి, పాపం ఆయన మందుకూడా ఊరికేనే యిచ్చారు! మందంటే ఇచ్చారు కాని అనుపానంకూడా ఎక్కడిస్తారు చెప్పండి? అడిగితే అదికూడా ఇచ్చేవారే! అంత మంచివాడాయన! కాని నేనే మొహమాట పడ్డాను. లేనివాడికి మొహమాటమేమిటి

చెప్పండి? అడిగేస్తే తీరేపోను అని తీరా యిప్పు డనుకొంటున్నాను" అన్నాడు.

వెంకటాయ ఈ కథంతా క్షణంలో కల్పించాడు. ఆ డాక్టరెవరో అతడు తను చెప్పినంత మంచివాడవునో కాదో వాడికి తెలియనే తెలియదు.

'అనుపానమేగదా నేనిస్తాలే పోనీ. ఏమిటా అనుపానం? దేనితో పుచ్చుకో మన్నాడు? తేనెతోటా? లేక ఏ జీలకర్ర రసమైనా, మిరియాల కషాయమైనానా?' అని అడిగింది బంగారమ్మ.



వెంటనే వెంకటాయ ఆ కాగితాన్ని ఆమె చేతికిచ్చి, 'అమ్మా, చదువురాని వాణ్ణి. మీరే చూడండి' అన్నాడు.

ఆమె చీటీ చదివి, ఈ మందేదో భోజనా నంతరం పుచ్చుకోమని ఉంది. అను పానమేమీ రాయలేదే?' అంది. అందుకు వెంకటాయ; 'అదే, ఆ భోజనమేనమ్మా అనుపానం. దానికోసమే పొద్దుటినించీ తిరుగుతున్నాను!' అన్నాడు.

నిర్ఘాంతపోయింది ఆ యిల్లాలు. మరొక ఆవిడైతే 'ఇదా నీ ఎత్తు?' అని, ఛడీమని తలుపు మూసేసుకుని పోయేదేగాని బంగా రమ్మ మాటనిరుకైన మనిషి. ఏ అనుపాన మైనా ఇస్తానని ఒప్పుకుంది గనక, వాడికి ఆపూట అన్నం పెట్టటానికే నిశ్చయించు కుని, కడుపునిండా అన్నం పెట్టింది.

వాడు యిక తనదారిని పోతాడనుకుంది బంగారమ్మ. వాడలా పోక, 'పిన్నీ! ఒక్క క్షణం ఈ సావిట్లో నడుం వాల్చి మరీ పోతాను' అంటూ తుండుగుడ్డ పరిచాడు.

'సరేగాని, మందు పుచ్చుకోడం మరిచి పోయావురా వెంకటాయ్' అందావిడ.

వెంకటాయ నవ్వుతో, 'నా రోగం ఆకలి రోగం పిన్నిగారూ. ఆ రోగానికి సరిఐన మందూ, అనుపానమూ మీరుపెట్టిన భోజ నమే' అంటూ,తనదారిని తను పోయాడు.



# తీరని కోరిక



కాశీపట్టణంలో తిలోత్తమ అనే ఒక పద్దెనిమిదేళ్ల అమ్మాయి ఉండేది. అంత చిన్నవయసులోనే ఆ అమ్మాయి గొప్ప సంగీతవిద్వాంసురాలన్న పేరు సంపాదించు కుంది. ఆమె పేరు ప్రఖ్యాతులు విని, రాజుగారు ఆమెను రప్పించి, తన కుమార్తె ఐన చంద్రరేఖకు సంగీతం చెప్పటం కోసం నియమించారు. తిలోత్తమా, చంద్ర రేఖా ఇంచుమించు సమాన వయస్కులే. అందుచేత వాళ్లిద్దరికీ చక్కటి స్నేహం కుదిరి, కలిసి మెలిసి తిరుగుతుండేవారు.

కొంతకాలమయేసరికి, రాజుగారు తన కుమార్తె సంగీతం ఎంతవరకూ వచ్చిందో తెలుసుకోవాలని ముచ్చటపడి, అంతః పురానికి వచ్చారు. ఆయనవెంట రాణిగారి తమ్ముడూ, చంద్రరేఖకు మేనమామా ఐన వీరసేనుడుకూడా వచ్చాడు. చంద్రరేఖ తాను తిలోత్తమదగ్గిర నేర్చుకున్న పాటలు కొన్ని పాడి వినిపించి, తన విద్య కనపర చింది. కూతురు విద్యకు రాజుగారు మెచ్చుకున్నారు. వీరసేనుడుకూడా మెచ్చుకోవలిసిందే కాని, తిలోత్తమను చూచినప్పటినించీ ఆమెను పెళ్లిచేసుకోవా లని అతనికి కోరికపుట్టింది.

ఒకరోజున తిలోత్తమ ఒక్కర్తే ఉండగా చూచి, వీరసేనుడు 'తిలోత్తమా, నన్ను పెళ్లి చేసుకో. నీవు కోరిన నగలు చేయి స్తాను' అన్నాడు. రాణీగారి తమ్ముడన్న మాటేగాని, రూపానికి వీరసేనుడు పరమ అసహ్యంగా ఉంటాడు. అలాంటివాణ్ణి పెళ్లి చేసుకోటానికి తిలోత్తమ ఒప్పుకోలేదు. కాని వీరసేనుడు తన ప్రయత్నం మాన లేదు. ఒకానొక కీకారణ్యంలోకిపోయి, ఒక మందులదాన్ని ఆశ్రయించాడు. అది పదివరహాలు పుచ్చుకుని, ఏదో యింత నల్లటి భస్మం సీసాలో వేసియిచ్చి, "వోయి

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు

దొరా!—ఈ పొడి చమురులో కలిపి ఆ పిల్ల తలకు రాయి. ఆమె తనంత తనే వచ్చి పూలదండవేసి నిన్ను పెళ్ళిచేసేసుకుంటుంది" అని చెప్పింది.

మందులదాని మాటప్రకారం వీరసేనుడు ఒక అమావాస్యనాటి రాత్రిపూట తిలోత్తమ నిద్రపోతూన్నగది ప్రవేశించాడు. ఆ మందు తలకు తగిలినతక్షణమే ఆమెకు తనపైన ప్రేమ పుట్టుకు చక్కా వస్తుందనీ, కనుక ఆమెకు మెలకువవచ్చినా ప్రమాదం ఏమీ ఉండదనీ నమ్మకంతో ఆ మూర్ఖుడు ఆమె తలకు తైలం రాయసాగాడు.



ఆమెకు ఇట్టే మెలకువవచ్చి 'దొంగ! దొంగ!!' అని కేకపెట్టేసరికి ఆ పక్కగదిలోనే పడుకుని ఉన్న చంద్రరేఖకుకూడా మెలకువ వచ్చింది. ఆమెకూడా దొంగ! దొంగ!! అని అరిచేసరికి, వీరసేనుడు పరుగుచ్చుకుని, ఎలాగో ఇంటికి చేరుకున్నాడు. ఇంతపని జరిగినా వీరసేనుడికి తిలోత్తమపైన మమత పోలేదు. తాను గట్టిగా రాసిన ఆ తైలం తిలోత్తమకు పనిచేసి ఆమె పూలహారంతో తన మేడకు వస్తుందని రెండు మూడు రోజులవరకు ఎదురుచూశాడు. ఆతర్వాత తనే ఆమె మేడ పరిసరాల్లోకి వెళ్లి తచ్చాడి చూశాడు. ఏమీ లాభం లేకపోయింది. అప్పుడు తెలిసింది అతనికి, ఆ కోయది మోసంచేసివుంటుందని. తరువాత వీరసేనుడు కొందరు దొంగలను నియమించి తిలోత్తమను రహస్యంగా ఎత్తుకరావటానికి ఏర్పాటుచేశాడు.

కొన్నాళ్లకి చంద్రరేఖా, తిలోత్తమా చెలికత్తెలతోసహా నగరానికి సమీపాన ఉన్న ఉద్యానవనంలో కొన్నిరోజులు సరదాగా మకాంచేసి రావాలని వెళ్లేరు. తిలోత్తమ ఎక్కడెక్కడ మసలుతూవున్నదీ వీరసేనుడు నియమించిన దొంగలు కనిపెడుతూనే



ఉన్నారు. వాళ్లారాత్రి ఉద్యానవనంలో పొంచి ఉండి, అర్ధరాత్రి అందరూ గాఢ నిద్రపోయే సమయానికి భవనం ప్రవేశించారు. అక్కడందరూ తూలికా తల్పాల మీద మాంచి నిద్రలో వున్నారు. తిలోత్తమను ఆమె పగలు కట్టిన చీరనుబట్టి దొంగలు గుర్తుంచుకునే వున్నారు గనుక, ఆ చీర కట్టుకున్న పిల్ల పడుకొని వున్న మంచం కనిపెట్టి, ఆమెకు మెలకువ రాకుండా ఆ మంచాన్ని మోసుకుని, జాగ్రత్తగా తీసుకెళ్లి వీరసేనుని ముందు పెట్టి 'మా బహుమానమండి, బాబయ్యా!' అన్నారు. 'ఇస్తాను, ఇస్తాను. అంటూ సంతోషం పట్టలేక నిద్రలో ఉన్న అమ్మాయి కేసి ఒక్క మాటు చూశాడువీరసేనుడు. తీరా చూసేటప్పటికి ఆమె తిలోత్తమ కాదు! తన మేనకోడలు చంద్రరేఖే! "ఈమెనా తీసుకొచ్చారు, గుడ్డిమాలోకం! జాగ్రత్తగా తీసుకెళ్లి, అక్కడ దించేసి రండి" అని వాళ్లని తిట్టి పంపాడు వీరసేనుడు.

చేసేదిలేక దొంగలు మంచం నెత్తిన బెట్టుకుని తిరిగి ఉద్యానవనానికి బయల్దేరారు. అంతలో గస్తీతిరిగే రాజభటుల సందడి వినపడేసరికి ఆ మంచంతో పట్టుపడితే తమ ప్రాణాలు దక్కవుగదా అని రాత్రికి రాత్రే వాళ్లు సమీపంలో ఉన్న ఒక అడవిలో ప్రవేశించారు. తాము పడ్డ కష్టం ఊరికే ఎందుకు పోవాలని చెప్పి, ఆ దొంగలు చంద్రరేఖ నగలన్నీ వొలుచుకుని, ఆమెనా అరణ్యంలో ఒంటరిగా వదిలేసి వాళ్ల దారిని వాళ్లు పోయారు.

తెల్లవారేసరికల్లా రాజకుమార్తె కనపడటంలేదన్న వార్త నగరమంతా పాకిపోయింది. రాణీ రాజూ వచ్చారు ఉద్యానవనానికి. వీరసేనుడూ వచ్చాడు. సమయంలో సమయమని తిలోత్తమను వశం చేసుకోటానికి అతడు మళ్లీ ఒక పన్నాగం

పన్నాడు. 'చంద్రరేఖ ఏమైపోయింది?' అని అంతా ఆత్రపడుతూంటే 'ఏమైపోతుంది! మనపాలిటి శనిలాగవచ్చి చేరింది ఈ తిలోత్తమ. నగలకోసం మన పిల్లను ఇదే చంపేసివుంటుంది. ఈమె కట్టుకున్న చీర ఎవరిదో అడగండి ముందు' అన్నాడు వీరసేనుడు.

రాణీ చూసి, 'ఔను. ఈ చీర మా అమ్మాయిదే! నీకెలా వచ్చింది తిలోత్తమా?' అని అడిగింది. అందుకు తిలోత్తమ, "నిన్న జలకమాడినప్పుడు చంద్రరేఖ ముందుగా గట్టుమీదకొచ్చి, చీకటిలో తన చీరకు బదులు నా చీర కట్టేసుకుంది. నేను వచ్చి చూచి చెబితే, 'ఇప్పుడు మార్చేదేమిటిలే? నాచీర నువ్వు కట్టుకో' అంది. అందుకని కట్టుకున్నాను" అని సమాధానం చెప్పింది.

'ఇదంతా కపటనాటకమాడుతోంది!' అని వీరసేనుడు తిలోత్తమపైన కారాలూ మిరియాలూ నూరజొచ్చాడు. ఏమీ తోచక రాజూ రాణీ దుఃఖంలో మునిగిపోయారు. వీరసేనుడే అక్కడ పెత్తనం చేసి, అధికారం పుచ్చుకుని భటులతో 'ఈ హంతకురాల్ని తక్షణం తీసుకెళ్లి, అడవిలో నది




అవతలిఒడ్డున వదిలేసి రండి' అని ఆజ్ఞాపించాడు.

అక్కడినించి వీరసేనుడు అడవిలో నదికి అవలి ఒడ్డుకి వెళ్లిపోయాడు. అతను చేరుకోకపూర్వమే రాజభటులు తిలోత్తమను అక్కడ వదిలి వెళ్లిపోయారు. 'ఇదేమిటి? ఏపాపం ఎరగందే ఈ వాదు నామీద పడిందే?' అని తిలోత్తమ ఏడుస్తూవుండగా ఎదుట వీరసేనుడు నిలబడి, నవ్వుతో, 'నీకేం ఫరవాలేదు తిలోత్తమా, నిన్నిక్కడ కలుసుకోడానికే నీకిలాంటి శిక్ష వేశాను!' అన్నాడు. తిలోత్తమ ఉగ్రురాలై, అతన్ని తిట్టటం మొదలెట్టింది.

'శాంతించు తిలోత్తమా. కోప్పడకు. నన్ను పెళ్లి చేసుకో. కూతురు పోయిందన్న బెంగతో మా బాపకి మతి పోతుంది. అప్పుడు రాజ్యం నాకు వస్తుంది. నేను రాజునవుతాను, నువ్వు రాణివవుదువుగాని' అంటూ వుండగానే ఎక్కడనుంచో ఒక బాణం వచ్చి తగిలి, 'హా' అంటూ అతను నేలమీదకు వొరిగిపోయాడు.

మరుక్షణంలో అక్కడికి విల్లంబులు ధరించిన ముసలి కోయవాడొకడు వచ్చి చూసి, 'అయ్యో, మనిషా? దూరాన్నుంచి చూసి ఏదో అడవిజంతువు మిమ్మల్ని హింసిస్తోందనుకుని బాణం వేశాను!' అన్నాడు.

'మంచిపని చేశావు తాతా. వీడు జంతువుకన్నా హీనుడు' అంటూ జరిగిన సంగతి అంతా చెప్పింది తిలోత్తమ. కోయ తాత ఆమెను ఓదార్చి, తన గుడిసెకు తీసుకుపోయాడు.

వాళ్లు వెడుతూవుండగా సమీపాన్ని 'బాబోయ్, చంపెయ్యకండి నిజం చెపుతాను' అన్న ఆర్తనాదం వినిపించింది. అక్కడకు వెళ్లి చూసేటప్పటికి తిలోత్తమను అడవిలో విడిచి తిరుగుదారి పట్టిన రాజభటులు ఒక మనుష్యుణ్ణి చెట్టుకు కట్టి, 'నిజం చెప్పు!' అని గద్దిస్తున్నారు.

తిలోత్తమకు నోటమాట రాక నిలబడి పోయింది. ఆ కట్లతో ఉన్నవాడు చెప్పిన వైనం వినేసరికి వాడు రాజకుమార్తెను ఎత్తుకొచ్చిన దొంగలలో ఒకడనీ, రాజభటులకు వాడుమాత్రమే పట్టుబడ్డాడనీ తేలింది. తిలోత్తమ వాడి కట్లు విప్పించి, చంద్రరేఖ ఉన్నచోటికి దారి చూపమంది. రాజపుత్రిక కంటబడగానే తిలోత్తమ ఆమెను ఆనందంతో కౌగిలించుకుంది. వీరసేనుడుచేసిన దుష్టపన్నాగాలు దారిలో చెప్పుకొంటూ వారు వెంటనే నగరం చేరుకున్నారు.



## తాబేటిచిప్ప చాలా గట్టిగా వుంటుంది

# ఎందుకో తెలుసా?

CHITRA

సమస్త జీవరాసులనూ బ్రహ్మ సృష్టించటం పూర్తి అయాక మిగిలిన చిల్లర మల్లర అవయవాల కలగాపులగమే తాబేలుగా యేర్పడింది. అందువల్లనే, ముందు కాళ్లొకలాగ వెనుక కాళ్లొకలాగ తల పాముతలలాగా ఒకదానికీ మరొకదానికీ పోలికలేదు.

ఇంత అందవికారంగా తయారైన తాబేలు "స్వామీ! ఈ అవతారంతో నేను మిగతా జంతుజాలంమధ్య ఎలా తిరిగేది?" అని బ్రహ్మకు అసంతృప్తిని వెల్లడించింది.

అందుకు బ్రహ్మ, "అందంగా లేనని విచారించకు. ఏ జీవికైనా గుణం ప్రధానం కాని అందం కాదు. పైగా నిరపాయంగా జీవితం వెళ్లబుచ్చగలగటం అవసరం. కనుకనే తక్కిన జంతుజాలానికి లేని శక్తి మీజాతికి యిస్తున్నాను. నీటిలోనూ, భూమి పైనాకూడా మీరు నిశ్చింతగా బ్రతుకవచ్చు. పైగా నీటిని శుభ్రపరచగలిగే శక్తికూడా ప్రసాదిస్తున్నాను. ఈ సుగుణంవల్ల మానవుడికి సహాయపడి జన్మ సార్ధకం చేసుకోవచ్చు" అని నచ్చజెప్పి పంపాడు.

కొన్నాళ్లు గడచిన తర్వాత ఒకనాడు ఒక ఊసరవెల్లి తాబేలును కలుసుకోవటం తటస్థించింది. తాబేలును చూస్తూనే అది పగలబడి నవ్వుతూ "ఆహాహా! ఏమి అందం? ఇంత వికృతంగా కనపడే తమ పేరేమిటో?" అని అడిగింది.

ఉక్రోషం వచ్చింది తాబేలుకి. "నన్ను తాబేలంటారు. నా ఆకారం చూచి నవ్వావే కాని, నా గొప్ప నీకేం తెలుసు? మేము నీటిలోనూ నేలమీదాకూడా విహరించగలం. మీలో అలాంటి జీవినొక్కదాన్ని చూపించు చూదాం! పైగా, మానవుడికి నిత్యమూ అవసరమైన నీటిని శుభ్రపరచి యివ్వగలం. మేమంటేమానవుడికి ఎంత ప్రేమో నీకేం తెలుసు?" అని గొప్పగా చెప్పుకొన్నది.

ఈ నెల బహుమతి పొందిన కథ — యస్. వి. ఆనందరావు, రాజమండ్రి

* బహుమతిగా మార్చి '51 నుంచి ఒక సంవత్సరం వరకు 'చందమామ' పంపబడుతున్నది.

ఇది విన్న ఊసరవెల్లి "అలాగా?" అంటూ తన దారిన అది పోసాగింది. అలా పోతూవుండగా దానికి ఒక మనిషి ఎదురైనాడు. అతనిని చూచి ఊసరవెల్లి "ఏమయ్యా, మానవుడా! తాబేలు అంటే మీ కెంతో ప్రేమట! ఎందువల్లనేమిటి?" అని అడిగింది.

అందుకు ఆమనిషి, "అది మా బావుల్లో నీరు శుభ్రపరుస్తుంది. అంతకంటే ముఖ్యమైన విషయం, దాని మాంసం చాలా రుచిగా వుంటుందికూడాను" అన్నాడు.

"అదా సంగతి!" అంటూ ఊసరవెల్లి వెళ్లి ఈ మాట కాస్తా జంతుకోటికి వెల్లడించింది. ఆ రోజు మొదలుకొని ఎక్కడ తాబేలు కనుపించినా విడిచిపెట్టకుండా జంతువులు చంపసాగినై.

ఇలావుండగా ఊసరవెల్లి పనిగట్టుకుని మళ్లీ మన తాబేలు దగ్గిరికి వచ్చి, "ఆ రోజు అలా గొప్ప చెప్పుకున్నావుగదా? ఇవాళ మీ బ్రతుకేమయిందో చూచావా?" అని దెప్పిపొడిచింది.

"నేను చెప్పిన దాంటో అబద్ధమేమీ లేదే. ఇలా ఎందుకు జరుగుతున్నదో తెలియకపాయె" అని తాబేలు విచారించింది. ఇంతలో ఆ ఊసరవెల్లి మాయమై దాని స్థానే బ్రహ్మ ప్రత్యక్షమయాడు. "ఓసీ తాబేలా! నీమానాన్న నీవు బ్రతికితే బాగుండేది. అలా గాక గొప్ప చెప్పుకుని ముప్పు తెచ్చుకున్నావు. నీ గర్వకారణంగా నీజాతి అంతా నాశనం కాబోతున్నది" అన్నాడు.

అప్పుడు తాబేలు "స్వామీ! క్షమించు. ఉండబట్టలేక నోరు జారాను. తగిన ప్రాయశ్చిత్తం జరిగింది. ఇకమీదట బుద్ధిగలిగి బ్రతుకుతాము. ఇంతటితోనైనా మా జాతి నిలిచేటట్టు చూడు" అని వేడుకున్నది.

దాని పశ్చాత్తాపానికి మెచ్చుకుని బ్రహ్మ తాబేలు జాతికి ఉక్కులాంటి కవచం ఒకటి ప్రసాదించి అంతర్ధానమయాడు.









ప్రయాణీకుడు : అరెరే ! రైలు కదులుతోందే. మరి నాదగ్గిర చిల్లర లేదు ఎలాగరా అబ్బీ !

కూలీవాడు : ఫరవాలేదు లెండి. మీ మర చెంబు నాదగ్గరే వున్నది.

ప్రయాణీకుడు : ఓరి, నీ అఘాయిత్వం కూలా ! ఇదుగో, ఈ రూపాయి నోటు తీసుకొని ఆ మరచెంబు ఇలా యివ్వు.



తల్లి : ఎందుకే సీతా, వాళ్ల సరోజన్ని కొట్టా వుట? దేవుడిముందు నిలుచుని 'ఈఒక్క సారి క్షమించ' మని లెంపలువేసుకో.

సీత : అమ్మా ! నిజంగా దేముడు క్షమిస్తాడటే ?

తల్లి : అఁ. మనసారా వేడుకుంటే తప్పక క్షమిస్తాడు.

సీత : అట్లాగైతే మరింత గట్టిగా కొట్టేవాన్నే !



సైన్సు మేష్టరు : రాముా, నీరూ పాలూ కలిసిన మిశ్రమాన్ని ఎలా వేరు చేస్తావురా ?

రాము : అదెంత పనండి ? హంసనుతెచ్చి మిశ్రమందగ్గిర వుంచితే అదే వేరుచేస్తుంది.



"నాన్నగారు ఇంట్లో వున్నారా అబ్బాయ్?"

"అదేమండీ అలా అడుగుతారు ? నేను ఇంత శ్రద్ధగా కూర్చుని చదవుతుండటం చూచి కూడా ఈమాత్రం గ్రహించలేరూ ?"

## వినోద చదరం



దిగువ యిచ్చిన ఆధారముల సహాయంతో ఈ క్రింది చదరాన్ని పూర్తి చెయ్యాలి. సరియైన మాటలతో గనక పూర్తి చెయ్యగలిగితే ప్రతిమాటలోని చివరి అక్షరమూ ఒకేలాగ వస్తుంది. అంతే కాదు. ఈ మాటలలో వచ్చే మొదటి అక్షరాలను వరుసగా కలిపి చదివితే ఈ నెలలో వచ్చే ఒక పుణ్యదినం పేరు వస్తుంది. ఆ పుణ్యదినమేదో కనుక్కోండి.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | | | | |
| 2. | | | | |
| 3. | | | | |
| 4. | | | | |
| 5. | | | | |
| 6. | | | | |

ఆధారములు :

1. మన్మధుడు
2. సేద్యగాడు
3. గురువు
4. వాసదేవుడు
5. దశకంఠుడు
6. శివుడు

తెలియకపోతే జవాబుకి 55-వ పేజీ చూడండి.

## యుక్తి లెక్క



నేను ఒకరోజున ఒక మామిడిపళ్ల అంగడికి వెళ్లాను. అక్కడ మామూలు మామిడిపళ్లూ, జీడిమామిడిపళ్లూకూడా ఉన్నయ్. 'మామిడిపళ్లు ఎలా?' అని అడిగితే అంగడివాడు యిలా చెప్పాడు: 'ముప్పావు మామిడిపండు ఖరీదు అర మామిడిపండు ఖరీదు, పైన అర్ధణా.' 'జీడిమామిడిపళ్లు ఎలా?' అని అడిగితే 'సగపావు మామిడిపండుకి రెండు జీడి మామిడిపళ్లు వస్తయ్.' అన్నాడు. నాదగ్గిర మూడు అణాలు వున్నై. అంగడివాడు చెప్పినది ఏమీ అర్థం కాక, "అబ్బాయీ, ఈ మూడణాలకూ వచ్చే పళ్లు యివ్వు" అన్నాను. అతను అలాగే ఇచ్చాడు. మూడణాలకు నేను ఏమేమిపళ్లు కొన్నానో కనుక్కోండి చూదాం?

మీరు కనుక్కోలేకపోతే జవాబు ఈ పేజీలోనే వున్నది చూడండి.

యుక్తిలెక్కకి జవాబు :

కొయ్యకుండా పళ్లు కావాలంటే మామిడి పండ్లు రావు. అందువల్ల మూడణాలకు 8 జీడిమామిడిపళ్లు కొనుక్కున్నాను.

# రామచిలక—తాతపిలక

రచన :

[ఆర్. వి. భాస్కరరావు, శ్రీకాకుళం]



తాతపిలక రామచిలక కలుసుకున్నాయి
పిలకచూచి రామచిలక వెక్కిరించింది
వెక్కిరింపు చూచి పిలక గక్కురుమంది
వెక్కివెక్కి తాతతోను కలకలమంది.

అలకతోను పిలకతాత యిటులన్నాడు :
'నా పిలకకున్న వెండిరంగు చిలక ! నీకేది ?
పిలకపూసిన వాననూనెలు నీవు పూసేవా ?
నాపిలక కట్టిన పట్టుకుచ్చులు నీవు కట్టేవా ?'

పిలకతాత పలుకులన్ని చిలుక విన్నది
అలుకచెంది రామచిలక పలుకుచున్నది :
'పలుకుపలుకు కాయలరుచి పిలకయెఱుగునా ?
తీయ తీయనైన పలుకు పిలక పలుకునా ?

ఆకుపచ్చరంగు చీర పిలక కట్టెనా ?
నాకు ఉన్న నాను పట్టెడ పిలక పెట్టెనా ?
యెఱ్ఱ యెఱ్ఱనైన రంగు ముక్కు ఉన్నదా ?
బుఱ్ఱ బుఱ్ఱ మంటు పిలక యెగురుచున్నదా ?'

చిలక పలుకులన్ని పిలక తాత విన్నాడు
అలుక మాని పిలకతాత ఊరుకున్నాడు.
ఇన్ని విన్న తాతపిలక చిన్నబోయింది
తిన్నగ నిలుచున్న పిలక వాలిపోయింది !

# రోకంటిపాటలు

సేకరణ :

[అడుసుమల్లి సరస్వతీదేవి, ముదినేపల్లి]



ఊరిముందరచేను వేయబోకన్న
ఊళ్లోను వియ్యమ్ము చేయబోకన్న
ఊరిముందరచేను కాకుల్లపాలు
ఊళ్లోను వియ్యమ్ము కయ్యాలపాలు.

అండలేనిఊర నుండదోషమ్ము
ఆశమాలినవారి నడుగదోషమ్ము
చెడ్డవారితొచెలిమి చేయదోషమ్ము
అన్యపురుషులతోడ నరుగదోషమ్ము.

వాడన్నిపూవుల్లు వాసన్నగలవా ?
ఓ తాత ! యీమనుము వద్దయ్యనాకు
ప్రేమలేని మగని పెండ్లాడితేను
కాపరాలన్నియును కడగండ్లపాలె.

వెంకటప్పుడికొండ వెలిశుండవలెను
ఎప్పటికి పుట్టిల్లు కలిగుండవలెను.
పుట్టింటి దీర్ఘాయు కావలెనటంచు
పున్నమాచంద్రుడికి పూజనేజేతు.

అత్తింటి దీర్ఘాయు కావలెనటంచు
ఆదినారాయుడికి అర్ఘ్యమ్ములిత్తు
ఆడవారీనేల కన్నావుతల్లి ?
ఆడవుల్లపాలేల చేశావుతండ్రి ?




## పేకముక్క చెప్పుకోగల కోడిగుడ్డు

పేకదస్తాలోనించి ఒక ముక్క ఎవరినైనా ఎంచుకోమంటావు. ఆతర్వాత బాగా ఉడకబెట్టిన కోడిగుడ్డునొకదానిని నీవు ప్రేక్షకులకు యిస్తావు. వాళ్లు దాన్ని బాగా పరీక్ష చేసుకుని తిరిగి నీకు యిచ్చివేస్తారు. అప్పుడు నువ్వు కోడిగుడ్డును పగలగొట్టినట్లైతే వాళ్లు ఎంచుకున్న పేకముక్క గుడ్డు లోపలిభాగంలో వ్రాయబడి వుంటుంది. ఈ ట్రిక్కు చెయ్యటం ఎలాగో యిప్పుడు చెబుతాను వినండి. సభకివచ్చే ముందు నీవు యింటిదగ్గరనే ఒక కోడిగుడ్డును ఈ క్రింద చెప్పిన విధంగా తయారుచేసి తెచ్చుకోవాలి—





మూడు ఔన్సుల వినిగార్ (Vinegar)లో ఒక ఔన్సు పటికపొడి బాగా కలుపు. ఇలా కలిపిన ద్రావకాన్ని ఒక బ్రష్షుతో ప్రేక్షకులు ఎంచుకోబోయే ముక్కబొమ్మ కోడిగుడ్డుపైన వ్రాయి. అలా వ్రాసి, వ్రాసిన గుర్తులు కంటికి కనుపించకుండా పోయే వరకు గుడ్డుని ఎండబెట్టు. ఆ తర్వాత గుడ్డుని 10, 15 నిమిషాలు ఉడకబెట్టు. ఈవిధంగా గుడ్డు తయారుచేసుకోవాలి.

మరొకవిషయం: ప్రేక్షకులు ఎంచుకొనే పేకముక్క ఒకటీ, నీవు వ్రాసిన పేకగుర్తు మరొకటీ అయినట్టయితే పట్టుబడిపోతావు. అందుకని ప్రత్యేకించి అన్నిముక్కలూ ఒకేలావుండే పేకదస్తా ఒకటి సంపాదించి

ఉంచుకోవాలి. ఈ దస్తాలోవన్నీ ఒకే రకం ముక్కలు గనుక ప్రేక్షకులు ఏముక్క తీసినా యిబ్బందిలేదు. తర్వాత గుడ్డు పగలగొట్టినట్లైతే వాళ్లు ఎంచుకున్న పేకముక్క గ్రుడ్డు లోపల స్పష్టంగా వ్రాయబడి వుంటుంది.

[ఈ ట్రిక్కును గురించి మీరు యింకా వివరంగా తెలుసుకో దలచినట్లయితే 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. కాని, వారి పాత అడ్రసుకుమాత్రం వ్రాయకండి. ఒక చిత్రమైన కారణంవల్ల వారు తమ అడ్రసు మార్చుకోవలసి వచ్చింది. అది ఏమిటీ అంటే—]

ఈ మధ్య మన ప్రొఫెసరు సర్కారు తమ ఇంద్రజాలవిద్యను ప్రదర్శించేందుకు బొంబాయి నగరం వెళ్ళినప్పుడు ఒకచిత్రం జరిగింది.

ఎవరో తుంటరులు ప్రొఫెసరుగారి తపాలాపెట్టె బ్రద్దలగొట్టి దానిలో ఉత్తరాలన్నీ కాజేశారట. ఇలా కాజేసిన ఉత్తరాలలో మీరు వ్రాసిన వుత్తరాలుకూడా ఉండి వుండవచ్చు. మీరు ప్రొఫెసరుగారికి వ్రాసిన ఆ వుత్తరాలకి జవాబు రాకపోయినట్టయితే దానికి కారణం యిదేనని తెలుసుకోండి. యిక మీదట మీరు ప్రొఫెసరుగారికి వ్రాసే వుత్తరాలు పోస్టుబాక్సు అడ్రసుకుగాక, ఈ కొత్త అడ్రసుకు వ్రాయండి.

క్రొత్త అడ్రసు యిది:

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్,
12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్,
కలకత్తా - 19.

# చందమామ పజిల్
## (భాషాభివృద్ధికి)

**అడ్డము:**

1. మనవి
6. అసక్తి
8. మనస్సు
10. నర్సము
11. సూర్యుడు
12. భీముడి అయుధము
13. బొమిక
15. అటవిడుపు కలగలుపు




**నిలువు:**

2. వేదాంతి
3. భార్గవుడు
4. నమస్కారము
5. తుమ్మెద
7. కలువ
9. స్వర్గము
10. తలగుడ్డ
13. ఎక్కడ?
14. కవిత చెప్పువాడు

# అట్టమీది బొమ్మ



శ్రీకృష్ణుడు కంసుణ్ణి సంహరించిన సంగతి తెలుసుకదా! కంసమహారాజు మరణించగానే అతని భార్యలు అస్తి, ప్రాప్తి పుట్టింటికి పోయి, తమకు పట్టిన దురవస్థనుగురించి తండ్రిఐన జరాసంధుడికి ఎరుకపరిచారు. జరాసంధుడు చాలా బలపంతుడు; పౌరుషవంతుడైన రాక్షసరాజున్ను. కుమార్తెల గతి తెలియగానే అతడు రోషపూరితుడై, ఇరవైమూడు అక్షౌహిణీల సైన్యంతో మధురాపురంమీదికి దండెత్తి వెళ్ళాడు. ఈ ముట్టడి చూచి కృష్ణుడు వ్యాకుల చిత్తుడై, కర్తవ్యమేమిటా అని ఆలోచించాడు. 'ఇప్పుడు భూభారం చాలా హెచ్చుగా వున్నది. కాబట్టి ఈ ఇరవైమూడు అక్షౌహిణీల సైన్యాన్ని హత మార్చాలి' అని నిశ్చయించి, శంఖం పూరించాడు. కృష్ణ, జరాసంధుల మధ్యని భయంకర యుద్ధం జరిగింది. ఈ మహా యుద్ధానికి పధ్నాలుగు భువనాలూ గజగజలాడిపోయాయి. చచ్చినవాళ్లు చావగా, మిగిలినవాళ్లు పటాపంచలై జరాసంధుని సేన నామరూపాలు లేకుండా పోయింది. బలీయుడైన జరాసంధుడు ఈవిధంగా పదిహేడుమారులు దండెత్తి వెళ్లి అన్నిసార్లూకూడా కృష్ణునిచేతిలో ఓడిపోతూనే వచ్చాడు. ఇక పద్దెనిమిదోసారి మళ్లీ మధురాపురిపైకి ఎత్తివెళదామని అనుకొనేటంతలో, నారదమహర్షి ప్రేరణవల్ల యవనుడు తన మూడుకోట్ల మ్లేచ్ఛసేనలను కూర్చుకొని మధురను ముట్టడింపవచ్చాడు. 'అబ్బో! అటు జరాసంధుణ్ణీ ఇటు యవనుణ్ణీ ఒక్క సారిగా ఓడించటం కష్టసాధ్యమైన పని అవుతుందే. పోనీ అని ఊరుకుంటే నా యాదవులందరూ నిష్కారణంగా హతులైపోతారు' అని దూరం యోచించాడు శ్రీకృష్ణుడు. తక్షణమే విశ్వకర్మను పిలిపించి, 'మనకు ఇటువంటి గొప్ప విపత్తు వచ్చి ఉన్నది. కనుక నీవు ఈమట్టున సముద్రంమధ్యని ఒక దుర్గం నిర్మించవలసింది' అని ఆజ్ఞాపించగా, ఆ శిల్పి, కనుమూసి తెరచేటంతలో అనేకమైన హంగులతో దివ్యమైన జలదుర్గం నిర్మించాడు. శ్రీకృష్ణుడు సంతోషించి, ఆ నగరానికి 'ద్వారక' అని పేరుపెట్టి, యోగమాయా ప్రభావం వల్ల తనవారినందరినీ అక్కడ సురక్షితంగా ప్రవేశపెట్టాడు.

పజిలుకి జవాబు :




50-వ పేజీలోని

వినోదచదరానికి జవాబు :

| | | | | |
|---|---|---|---|---|
| 1. | మ | ద | ను | డు |
| 2. | హో | లి | కు | డు |
| 3. | శి | క్ష | కు | డు |
| 4. | వ | రు | ణు | డు |
| 5. | రా | వ | ణు | డు |
| 6. | త్రి | నే | త్రు | డు |

## "ఎందుకో తెలుసా?"



"తాబేటిచిప్ప చాల గట్టిగా ఉంటుంది ఎందుకోతెలుసా?" అన్నదానినిగురించి మాకు వచ్చిన కథలలో కల్లా ఉత్తమంగా వున్న కథని ఈ సంచికలో ప్రచురించాం. ఈ రచన పంపినది ఎస్. వి. ఆనందరావు, రాజమండ్రి. బహుమతిగా యితనికి మార్చి '51 నుండి ఒక సంవత్సరం వరకు 'చందమామ' పంపబడుతున్నది.

వచ్చేనెల (ఏప్రిల్ '51) కు
"జిరాఫీ మెడ పొడుగ్గా వుంటుంది"
ఎందుకో తెలుసా?

అనే విషయాన్ని గురించి మీరు తెలుసుకుని ఒక చక్కటి కథ వ్రాసి పంపండి. రెండు పేజీలకు మించకుండా వుండాలి. కథలు మార్చి 15-వ తేదీలోగా మాకు చేరేట్టు ఈ క్రింది అడ్రసుకు పంపండి.



"కథల తాతయ్య"
**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు 1686, మదరాసు-1




ఈ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (ఏప్రిల్) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI, at the B. N. K. Press, Madras-1



Chandamama, March. 51 Photo by B. Ranganadham

రెండు, నాలుగు

